# జానకీ-శర్మ

*మానిమాణిక్యం....*



దేశీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
మే — 1955
వెల: రూపాయి
దేశీప్రెస్, విజయవాడ



సంపాదకులు:

బొందలపాటి శకుంతలాదేవి

శివరామకృష్ణ

## ఇందులో :

1. శర్మ కాఫీ తాగాడు
2. ప్రకరణ భంగం
3. శర్మ జానకిని ముద్దుపెట్టుకొన్న ఘట్టం
4. ప్రతిజ్ఞా పాలనము

# భూమిక

జీవాత్మ హృదయ పద్మ సంచారంలో నానా భావమతులు, నానా రసమతులు కలుగుతూ ఉంటవి. పశ్చిమ దళంలో విశ్రమించితే క్రీడావినోద మతి కలుగుతుంది. ఉత్తర దళంలో విశ్రమించితే సుఖశృంగార మతి కలుగుతుంది. అని ఉపనిషత్తు చెప్పుతున్నది. క్రీడావినోద మతి ఒకవిధంగా హాస్యరసానికి అనుకూల మయిన స్పందము. సుఖశృంగారమతి కలిగినప్పుడు కూడా క్రీడా వినోదములు కలిగి ఉంటవి. ఈ రెండు సన్నివేశాల లోనూ హృదయానికి 'వికాసం' ఉంటుంది. కావ్యార్థము లను సహృదయుడు చక్కగా భావించితే ఆత్మానంద సముద్భవ మయిన ఒక ఆస్వాదం పుట్టుతుంది. ఆ ఆస్వాదమును అనేక రకాలుగా విభజించవచ్చు. వికాసమనేది ఆ విభాగాలలో ఒకటి. ఈ వికాసమే హాస్య శృంగారా లకు పునాది.

వికృతాకారము, వికృత వచనము, వికృత వేష భాషలు, వికృత చేష్టాదులూ ఉంటే హాస్యము ఉత్పన్న మవుతుంది. ఆత్మస్థమని పరస్థమని యిది రెండు రకాలు. వికృతాకారాదులను చూడగా తమంతట తమకు గలి

గేది ఆత్మసంస్థము. నవ్వేవానిని చూచినప్పుడు కలిగితే పరసంస్థము. హాస్యానికి ఆరు భేదాలు ఉన్నవి. స్మితము, హసితము, విహసితము, అవహసితము, అపహసితము అతిహసితము. ఈ భేదాలన్నీ కలిగే నవ్వులోని ఎక్కువ తక్కువలనుబట్టి ఉంటవి.

మానవుడు నవ్వగల ప్రాణి. ఇతర ప్రాణులకు కూడా కొంత నవ్వగల శక్తి ఉన్నా పరిహాసగౌరవము మానవునిదే. కోతి కిచ కిచ మన్నా అది మానసిక క్రియ కాదు. నవ్వడానికి మానసక్రియ ఉండాలి. మన జీవనంలో హాస్యం అవశ్యం ఉంటుంది. నవ్వడంలో శరీరక్రియ ఉంటుంది. కాని హాస్యమయి పరిస్థితిని గుర్తించగల బుద్ధి క్రియ వుండితీరాలి. హాస్యాభిరుచి కల వ్యక్తి ఇతరుల వలె జీవితంలో నిరాశ పడడు. గంభీర ప్రకృతుల మని అనుకునే కొందరు నవ్వడానికి జంకుతారు. అయినా లోలోపల ముసి ముసిగా ఉండక మానరు. మానవుడు గాంభీర్య ముద్రా భారాన్ని దీర్ఘకాలం సహించలేడు. పిల్లల మాదిరి గంభీరుడు కూడా గాంభీర్యంలోనుంచి విడుదల పొందాలనే చూస్తాడు. అందుకనే నాటకకర్తలు అక్కడక్కడ పరిహాసం కలుగజేసే సన్నివేశాలు కూర్చుతారు. హాస్యానుకూలమయిన కోమల స్వభావం ఏర్పడితే మానవుడు నవ్వడానికి, నవ్వించడానికి ఎప్పుడూ యత్నం చేస్తాడు.

"శర్మగారూ! అంత తీవ్రంగా ఉపన్యసిస్తూ కూడా చప్పున హాస్యంలోకి దిగుతారేమండీ?" అని ఒక రన్నారు. అది పొరపాటని నేను గుర్తించలేను. లోకాభిరుచిని అనుసరించిన శిక్షణ చర్య ప్రతివానికి అవసరమే. హాస్యము లోకచిత్తాన్ని మృదూకరించి సంస్కరించుతుంది. అయితే అది మోతాదు దాటరాదు. దాటితే ఆభాస అవుతుంది. సంస్కరించే హాస్యము అంత మంచి హాస్యం కాకపోవచ్చు. వినోద పెట్టే హాస్యం వేరొకటి వుంది. అది మన జీవనంలో బాగా ఉపయోగిస్తుంది. హాస్యము రుచింపగల వ్యక్తి మానవులలో ప్రీతి, అనుకంప కృప కలుగజేస్తాడు. వానిని నియమింపజేస్తాడు. దలితులపై, దరిద్రులపై, దుఃఖితులపై కోమలభావాన్ని కలిగించడానికి సహాయపడుతాడు. ఉదారస్వభావుడై వెంటనే సుఖదుఃఖాలకు కరగిపోతాడు. కోమలిత దయాళుత కలుగజేసే హాస్యమే చాలా మంచిదని చాలామంది అంటారు, వీరు చాలా ఉపకారులని లోకం సరసంగా ప్రసన్నంగా సార్థంగా చూస్తుంది.

బాగా నవ్వగలిగితే మంచి ఆరోగ్యం కలుగుతుందిట. బాగా ఆరోగ్యంగా ఉంటే మంచి నవ్వు చక్కగా వస్తుందిట. నవ్వితే రక్తసంచారంతగినట్లు కలుగుతుందని, అవసరమయిన స్థలంలో రక్తం ప్రసరిస్తుందని, బాగా వ్యాయామం అవుతుందని వస్తాదు ప్రియులున్నా అంటా

కేమో. వారామాట అన్నప్పటికీ నవ్వలేని వాళ్ళుంటే ఉంటారు. అనుకున్నంతగా హాస్యం పుట్టిస్తూ ఉంటే మనోవేదన తగ్గిపోతుంది, తీవ్రచింతలుండవు. భారం తగ్గినట్టు వుంటుంది. ఏదో తేలికగా వుంటుంది. ఆనందానికి హాస్యం ఫలమయితే హాస్యానికి ఆనందం ఫలము.

ప్రతివ్యక్తికి తనయందు ఒక నమ్మకం వుంటుంది. ఎవరికీ తెలియకుండా తాను గొప్పవాడను కుంటాడు. ఇతరులను ఆ విధంగా చూడడు. వాళ్ళకు తెలియకుండా తాను వాళ్ళపై ఒక పెత్తనదారుడు అవుతాడు. వారంతా తనకు అనుయాయులనుకుంటాడు. తన భావానికి వారు ఏమాత్రం అనుకూలం కాకపోయినా వారి చేష్టలన్నీ వికృతంగా భావిస్తాడు. తాను హాస్యం పొందుతాడు. "నేను పాలకుణ్ణి. వీరందరిపై నేను ప్రభువు" అనే ధీమా కలిగితే తనలో హాస్యానికి చోటు కలుగచేసికొంటున్నాడన్న మాట. అటువంటి ప్రభువు ఒక్కసారి నవ్వి తన ప్రభుతాఫలము అనుభవించిన ఆనందము పొందుతాడు. ఇటువంటి అంతః ప్రవృత్తిని ఎవరూ అడ్డుకోలేరు. అందుకనే మానవ ప్రవృత్తిలో హాస్యం ఉండితీరాలని, ఉండితీరుతుందని, ఉండకపోతే జీవనసాఫల్యం లేదని "ఆంధ్రరత్నము" అనేవాడు.

హాస్యంలో శృంగారంలో మాదిరిగా మార్పు నెమ్మది నెమ్మదిగా కలుగదు. తీవ్రంగా విపరీతంగా

కలుగుతుంది. అయినా అప్రసన్నంగా ఉండదు. ఆ కలిగిన మాన్పునే మరిపించచేస్తుంది. మానవుడు తన స్వతంత్రతను మరచిపోయి యంత్రం మాదిరి అయినపుడు నవ్వుల పాలవుతాడు. ఇటువంటి వైపరీత్యమే అంతటా హాస్యానికి హేతువనుకోనక్కరలేదు. హాస్యమనేది ఒకరకంగా హార్ద చేష్ట. మనస్సు ప్రసన్నంగా సంతోషంగా ఉంటే నృత్యము, గానము మొదలయినవి ఇష్టమవుతవి. అదే విధంగా నవ్వడం కూడా అభీష్టమవుతుంది. నవ్వడానికి ఒక్కొక చోట ఒక్కొక హేతువును కల్పించుకుంటాడు. సాధారణంగా మానవుడు నానా నియమబంధాలకు లోనై ఉంటాడు. ఎప్పుడయినా ఆ బంధాలను సడలించుకోవాలని చూస్తాడు. నవ్వడంలో ఈ బంధవిముక్తి కొంత ఉంటుంది. మనము చాలామందిని ధైర్యంగా అసహ్యించుకోలేము. కొందరిని వెంటనే అసహ్యించుకోగలము. ఈ అసహ్యపడడంలో చాలా భేదా లుండవచ్చు. ఇవన్నీ హాస్యానికి హేతువులే. వెకిలిగా నవ్వడం సహృదయత్వం లేకపోవడమే. వెకిలితనం, చిలిపితనం లేకుండా నవ్వగలిగితే అది సహృదయత్వానికి దారి. సహృదయత్వానికిదారి చూపలేని హాస్యమయితే మానవజాతికి ఒక కళంకము అవుతుంది. మనం నవ్వితే ఎవరికీ హాని కలుగరాదు. ఎవరిని నవ్వుతామో వారుకూడా మనతో సమంగా నవ్వగలిగేటట్లు మనం నవ్వాలి. అది మంచినవ్వు. ఇత

రుల గౌరవానికి హాని కలుగకుండా, ఇతరుల భావాలను భంగంరాకుండా హాస్యం ఉండడం మంచిది. దేవతలను వెటకారం పట్టించడం భక్తసమాజంలో ఎవరికీ ఇష్టం కాదు. కొందరి సమాజధర్మాలను వెక్కిరించడముకూడా ఇటువంటిదే. ఏదో తన మిత్రులు నవ్వుకున్నంత మాత్రాన బలవంతంలేకుండా మంచి హాస్యమని అనిపించ గలమా? క్లిష్టభాషలో శ్లిష్టభాషలో హాస్యం ఉంటే అందరికీ అందదు. మరీ పలచనా కారాదు. చిన్న చిన్న మాటలలో అది ఉండాలి. హాస్యం సాహిత్యకంగా ఉంటే ఎవరికీ అనర్థకం రాదు. అచుంచితమయిన హాస్యమైతేనే నవంగా ఉండి నవ్వు వస్తుంది. ఒకరు చెప్పిందే చెప్పితే ఇకిలించాలేకాని నవ్వు రాదు.

మంచి హాస్యప్రకాశము సహజ ప్రతిభ కలవానికి సాధ్యమవుతుంది. పరిస్థితి విశేషముల ననుసరించి ఆతడు నిరూపిస్తాడు. అది చక్కని కళ. అటువంటి హాస్యకళనే మనము అభినందిస్తాము. భారతీయుల సాహిత్యభావన చాలా సముదాత్తమని అంగీకరించడానికి రసప్రశ్న బాగా ఉండాలి. హాస్యమును వారు ఉత్త చమత్కారరూపంగా భావించలేదు. భావమాత్రమే అనిన్నీ అనలేదు. హాస్యము రసము అన్నారు. ఏదయినా భావము రసీకృతము కావా లంటే చాలా అంగోపాంగము లుండాలి. హాసము కలి గించినంతమాత్రాన రససిద్ధి లేదు. హాస్యరసానికి హాస

మనే భావము పూర్వావస్థ. ఈ హాసము స్థాయిగా నిరూపితం కావాలి. అది ముఖ్యంగా ప్రతిపాదనం పొందాలి. దానికి తగిన పోషణక్రమం ఉండాలి. విభావానుభావ సంచారులు సుశ్లిష్టంగా ఉండాలి. అప్పుడంత రాయం లేకపోతే నిరూపితమయిన హాసము హాస్యరస మవుతుంది. హాస్యరసమును హాస్యరసంగా ముఖ్యరసంగా వర్ణించడము ఎక్కడా కుదరదు. హాస్యరసాస్వాదము స్వస్థానంలో స్వపరిధిలో మాత్రం ఉండిపోదు. అది శృంగారండాకా వచ్చి నవ్వులమాదిరి తేలిపోతుంది. దాని స్థితి అంతే. అది ఎప్పుడూ స్వరూప ప్రతిష్ఠము కాలేదు. ఎవరూ ఆ విధంగా చేయుడము కుదరదు. అందువలననే హాస్యము అంగిరసముగా భారతీయుల సంస్కృత సాహిత్యంలో లేదు. ఎక్కడనయినా కొన్ని ప్రహసనాలవంటి వానిలో ముఖ్యరసముగా ఉన్నట్లు కనపడినా అది ఎన్నదగినదిగా నాకు తోచదు. అలంకారికులెవరున్నూ హాస్యరసమును అగౌరవ పరచలేదు. సంస్కృత సాహిత్యంలో హాస్యరసం ఉండవలసిన రూపంలో చక్కగా ఉంది. "యన్నభారతే, తన్నభారతే" భారతంలో లేనిది భారతవర్షంలో లేదు. అట్లాగే "యన్నసంస్కృతే, తన్న సంస్కృతే" అనిన్నీ నే నంటాను.

నాట్యశాస్త్రంలో భరతుడు హాస్యనిర్వచనంచేసి అందించిన అభిప్రాయాలనే భారతీయాలంకారికులు తగి

సంతగా నిరూపించుకొన్నారు. అసలు రసాలలో ఉత్పత్తి హేతువులు నాలుగు. శృంగార, రౌద్ర, వీర, భీభత్సములు. హాస్యము శృంగారమువలన కలుగుతుంది. "శృంగారానుకృతిర్యాతు సహాస్యాస్తు ప్రకీర్తితః" అని భరతుడు కంఠోక్తిగా అన్నాడు. శృంగారాభాస స్థితిలోగాని శృంగారానుకార స్థితిలోకాని హాస్యం కలుగుతుందన్న మాట. శృంగారము ఆభాసమయినప్పుడేకాక ఏ రసం ఆభాస అయినప్పటికీ హాస్యం కలుగుతుం దని, అభినవగుప్తుడననే అన్నాడు. అందుకనే హాస్యంలో అన్ని రసాలు ఉంటవనే ప్రసిద్ధి వచ్చింది. ఆయా రససిద్ధికై ఆయా దేవతను పూజించాలన్న నియమం మనసులో ఉంచుకొని భరతుడు "సితో హాస్యః ప్రకీర్తితః, హాస్యః ప్రమథదైవతః" అనిన్నీ నిరూపించాడు.

ఆంధ్ర వాఙ్మయంలో హాస్యమును కవులు నిరూపించిన రీతిని ఇక్కడ రూపించితే నన్ను హాస్యం పట్టిస్తారని భయపడడం అలవరచుకోలేదు. కొందరు కవులు ఏ రసమును నిబంధింప దలచినప్పటికి అది ఆభాసగా మారి హాస్యరసమై కూర్చున్నది. ఇక అదంతా పంచదార చిమ్మిరి అని మనం కేరింతలు పెట్టుతున్నాము. హాస్యానికి స్వరూపప్రతిష్ఠ లేనందువలన అంగముగానో ఉపాంగముగానో రసపర్యంతంలో ఆభాసస్థితికముగానో అది అభివర్ణిత మయినది. నవకాలసాహిత్యంలో ఈ విశేష

చర్చ వద్దు. ప్రత్యేకంగా "ఇది బాగుంది, ఇది బాగుంది" అని చెప్పి జారుకొని సన్మానం పొంది పోవడం చాలా సుళువు. "ఇదిగో! ఇది యిది" అని అనడం గండకత్తెర. ఒక సూటిపోటి మాట, ఒక విసురుము, ఒక కొక్కిరింపు, ఒక ఛలోక్తి, ఒక పోటు, ఒక గీటు, ఒక ఛలసు, ఒక వంకర టింకర వాణి, అక్కడక్కడ ఉన్నది. ఇది ప్రతిదీ హాస్యము అని అనవలసిన ప్రభుత్వాయోగం వస్తే అందాము. అప్పుడు అసలు హాస్యమును ఏమనాలా? అనిపిస్తుంది.

పైదేశిక ప్రభావం అధికమయిన తరువాత కొంత హాస్యం సరుకు దిగింది. గుండెనిబ్బరం లేనివాళ్ళందరూ "నాను నాను" అంటూ నవ్వులపాలయినారు. హాస్యమంటే హాస్యమన్నారు. అది హాస్యమైపోయింది. ఈ బండి యీ విధంగా సాగాలిసిందేనా? కాదంటే నీ మాటే కాదంటున్నారు కదా! అందుకని నేటిదాకా వచ్చిన నవహాస్యమును హాస్యం పట్టించాలనిపిస్తున్నది. విశకలితంగా 'అనలైజు' చేయడమనే పేరుతో శల్యపరీక్ష ఎప్పుడూ ఎవరికీ సముచితం కాదు. ఆ ధోరణితో "ఇవి హాస్యభేద ప్రభేదాలు" అని ఎంత గట్టిగా పలికినా నేను వినదలచను. అన్నిటిలోనూ సమశ్రుతి ఉంటే చెవిటివారయినా వింటారు. రససిద్ధి ఉందని, ఆస్వాదించాలని—నేను

నవరస గంగాధరం వెలువరించక పూర్వం గుంటూరులో జరిగిన నవ్యసాహిత్య పరిషత్సమావేశంలో నా భణితిలో నే నుపన్యసించాను. ఆ సమావేశ వార్తలను కృష్ణాపత్రిక ప్రకటించింది. "ఎవరో ఎర్రగా ఉన్న ఒక అబ్బాయి గడ గడా ఉపన్యసించాడు కాని, విన్నవాళ్ళకు విషయం ఏమిటో ఏమీ తెలియలేదు" అని నన్ను గురించిన సారాంశము. సరిగా ఆనాడు నేను ఆశించింది కూడా అంతే. ఆ వ్రాసిన వ్యక్తి ఈ మునిమాణిక్యంగారె. వారి కథలు నే నేవో కొన్ని చదివాను. అవి చదివి మునిమాణిక్యం ఎట్లా ఉంటారో నిశ్చయించుకున్నాను. సభలో నాకు మునిమాణిక్యం కనబడలేదే! ఇదంతా ఎట్లా వ్రాశారు? అనుకున్నాను. అప్పటికి మునిమాణిక్యమును ఊహించుకున్నానే కాని చూడలేదు. చూచి ఉన్నట్లయితే మీరా కథలు వ్రాయలేదు. మీరా వార్త వ్రాయలేదు అనే వాణ్ణి కాబోలు. ఇప్పుడు అటువంటి మాటలు అనగలగను. నవరస గంగాధరం చదివి ప్రథమంగా మునిమాణిక్యంగారే నన్ను అందంగా అభినందించారు. ఎదుట అంత చక్కగా అభినందించే వ్యక్తిని నేను ఏమీ అనలేను. ఇది అప్పటి సంగతి. ఇప్పుడు వేరు.

నవరస గంగాధరం భావవిచారణచేసింది. రసచర్చ చేసింది. ఉదాహరణ పద్యాలలో పేశలమయిన దంపతుల

మధుర ప్రణయ భాగ్యమును చిత్రించుతుంది. శృంగార విలాసమును సూచించే ప్రతి పద్యమున్నూ ఒక రసభావ లలితమయిన కావ్యం. దానిలో ఉదాహరణగా ఇచ్చిన ఒక్కొక పద్యమును ఒక్కొక కథాకావ్యంగా వ్రాయాలని ఇప్పుడు మునిమాణిక్యం తలచినట్లు నేను నిశ్చయించుకోవచ్చు. ఇదివరలోని కాంతం కథలు వేరు. ఈ జానకీశర్మ కథలు వేరు. అవి సామాన్యమయిన ఉపాధ్యాయుని జీవితఘట్టాలు. ఇవి యువసండితుని జీవిత ప్రఘట్టాలు. ఆ కథలన్నిటినీ కలిపితే ఒక అఖండ కథ అవుతుందా? అనే ప్రశ్నను ఇప్పుడు ప్రశ్నగానే నిలుపుతాను. ఈ కథలన్నీ కలిపితే ఒక అఖండ కథ అవుతుంది. ఇంకా ఈ విషయంలో వచ్చే కథలు కలిపినా అఖండ కథాత్వానికి ఏమీ భంగం రాదు. ఇదంతా ఒక కథా కావ్యం. అని ఇప్పటి కిప్పుడే అంటాను. అనగలను. అనవలెను కూడా.

ఉదయాన కాఫీ త్రాగడం మొదలు రాత్రి పది గంటలవేళ ప్రతిజ్ఞాపాలనం వరకూ గల నవయువ దంపతుల శృంగార చేష్టలను రచయిత నిరూపించారు. మహాకవి కాళిదాసు ప్రసన్నగంభీరంగా ప్రసాదించిన శృంగార సర్వస్వమంతా దాంపత్యవలయంలో సుబద్ధమై హద్దు మీరకుండా ఉంది. పండితరాజు బాహిరించిన భావ

భాండము భార్యాభర్తల భావచక్రము మీదనే గిరగిర లాడుతున్నది. ఈ రచన భద్రంకరమయిన సుమానుష పథములో రంగవల్లికలు తీర్చుతున్నది. మునిమాణిక్య పథము ఆ పథమునే నవంగా సుపథంగా చూపుతున్నది. కాళిదాసు మేఘదూతంలో వెన్నెలవసుసలు వర్ణించాడు. హరశిరశ్చంద్రికా ధౌతహర్మ్యములు, నిత్యజ్యోత్స్న పత్తనము ఎన్నో చెప్పి ఆసక్తినంతా వెలువరించి పరిణత శరచ్చంద్రికలు కల క్షపాసమయాలలో ద్విగుణిత కాంక్షానుభవాలను యక్షుని భావాకాశంలో బంధించాడు. మునిమాణిక్యం ఆసారమంతా ఈ దంపతుల సంసారంలో అందించారు. ఈ కథాకావ్యంలో లలితమయిన ధర్మశృంగారం అంగిగా ఉంది. హాస్యము అంగముగా ఉంది. మునిమాణిక్యం హాస్యరస నిబంధనా ప్రఖ్యాతి సంపాదించడమువలన హాస్యబ్రహ్మగా బిరుదాలు పొందడంవలన నేను హాస్యానికై మొదట అంత వ్రాశాను. ఈ కథలలోని హాస్యానికై మనము సభ్యంగా నవ్వుతాము, ఇది ఎబ్బెట్టుగాలేదని ఘర్షిస్తాము, ఆనందిస్తాము. హాస్యపర్యంతంలో అంతటా శృంగార రేఖ కనపడుతున్నది. కనుక మనం సంతోషిస్తాము. అంతేకాని శృంగారము ఆభాసీకృతమై హాస్యంగా మారి మనల్ని సంతోషపెట్టడమనేది దీనిలో లేదు. ఈ అంగాంగి భావపర్యాలోచనమును భావకులుగుర్తించాలి. అప్పుడు నా లక్షణానికి,

లక్ష్యానికి సమరంగం ఏర్పడుతుంది. ఈ గ్రంథాన్ని ముని మాణిక్యం హాస్యానికై వ్రాస్తున్నారని నే ననలేదు. హాస్యాన్ని మరిపించేందుకై వ్రాస్తున్నారు. మొదటినుంచీ అంతే. దంపతులకై వ్రాస్తున్నారు. సుఖసంసారాలకై వ్రాస్తున్నారు. కాంతం కథల పుస్తకాలను చాలామంది కళ్యాణపీఠంలో నవదంపతులకు బహూకరించడము చాలా సాభిప్రాయము, సముచితమూను. చాలామంది దంపతులు వీరి పుస్తకాలు జంటగా చదివి "బొమ్మకూడా ఉంటే బాగుండును" అనుకున్నారు. ఇటుమీదట ఎవరయినా మునిమాణిక్యం నరసింహారావుగారి బొమ్మను అందంగా వ్రాసి వారే వీరని నమ్మించడానికి పేరువ్రాసి అమ్ముకుని అధికంగా ద్రవ్యం సంపాదిస్తారేమో ?

ఈ మాటలు భావించండి !

1. శర్మ జానకిని ఒక కన్నుతో మాత్రం చూస్తూ ఈ కన్ను మూసి ఆ కన్నుతోనూ, ఆ కన్ను మూసి ఈ కన్నుతోనూ చూచి చివరకు రెండుకళ్లూ మూసికొని కూర్చున్నాడు.

2. సంస్కృత పుస్తకాలలో......వంటయింట్లో స్వంత భార్యతో అనవలసిన ముక్కలు సంస్కృత. సరస సాహిత్యంలో ఎక్కడా కనుపించలేదట.

3. మాధురీదర్శన పరమార్థములయిన సర్వమాంగళ మనోహరసృష్టి అంతా పరకీయాసంబంధియే కాని స్వకీయకాంతాకలాపాలు కావుట.

మునిమాణిక్యం హాస్యరచన ఇట్లాగే సున్నితంగా ఉంటుంది. "శర్మ జానకీ రూపభావనం చేస్తున్నాడు" అని వేయిసార్లు చెప్పినా రానిభావాన్ని కళ్ళుమూసుకున్న శర్మ అనుభవిస్తున్నాడు. మూడవది రాయప్రోలు వారి మధురభావాన్ని ఉద్దేశించినరీతి. ప్రకృతంలో మాటలన్నీ చాలా అతికినాయి. వినగానే మనకు నవ్వువస్తుంది. ఎవరినీ ఎక్కిరించడం లేదు. హృదయ వికాసం కలుగుతుంది. ఇటువంటి హాస్యం ఎంతఉన్నా సరదాగా ఉంటుంది.

1. శర్మ ఆ పళంగా తన కర్తవ్యమును నిర్ణయించుకొన్న వాడై తన సమీపంలో నీరజ కోరకము లేకపోవడము చేత తోటకూరకాడ ఒకటి తీసుకొని ఆమెపై విసిరాడు.

2. శర్మ ఆ పిల్ల నయనాలను గట్టిగా మూశాడు. ఆ పిల్ల కళ్లు అందంగా ఉంటవి. అట్లాంటి సౌందర్యసౌభాగ్యాన్ని చూచి ఆనందించాలేగాని అరచేతిలో మరుగు పరచడము కాంతాసమ్మతమూ కాదు, శాస్త్రసమ్మతమూ కాదు.

శృంగారానికై శ్లోకాలను పండితులు ఎంత వ్రాసుకున్నా తత్కాల భావస్సైశిత్యానుసారంగా శృంగార క్రియలు జరుగుతూ ఉంటవే కాని పద్యాల్లో మాదిరి సాగుతయ్యా? దంపతుల చేష్టలను రచయిత తటస్థంగా ఉండి వర్ణించడం ద్వారా ఈ విశేషాలు వస్తూన్నవి.

"గార్హస్థ్య పరమార్థమయిన శృంగారవిలాస సంపదనంతా ఆ చిరునవ్వు ఒలకపోస్తున్నది" అని రచయిత తన గ్రంథ రహస్యతాత్పర్యమును తానే మూడవకథలో వ్యక్తంచేశారు.

"సంస్కృతంలో ఉన్న శృంగారరస ప్రధానము లయిన కావ్యాలు చదవంగానే సరా! ఇల్లాగ ఆ జ్ఞానం జీవితానికి వెలుగు అయి ప్రసరించడమే చాల గొప్ప విషయము" అని అనే మునివచనం ఒకవిధంగా పండిత సంస్కృతులకు సంస్కృతపండితులకు పరిష్కారము. ఇంతగా లలితశృంగారమును హాస్యలలితంగా చిత్రించి మూడవకథ చివర ఇలా అంటున్నారు. "ఆ పవిత్రమూర్తి సుకుమార సుందరవిగ్రహానికి చెందిన సౌందర్యసీమలు అన్నీ అనగా శిరస్సునుంచి శ్రీపాదంవరకూ ప్రతిభాగమూ కూడా పవిత్రమూ మృదుమధురమూ ప్రేక్షణీయమూ వందనీయమూ అనిన్నీ, ముఖాంబుజము మొదలు పాదాంబుజమువరకు పూజార్హమని, ప్రతియువకుడూ తెలి

సికోవలసి ఉంది. "విశ్వశ్రేయః కావ్యం" అన్నారు కాబట్టి నేను ఈ మాట చెప్తున్నాను" మునిమాణిక్యం వారి శృంగారము అర్థం కావాలంటే ఈ పరమార్థం తెలుసుకోవాలి కాబోలు అని పాఠకులకు అనిపించదూ? దీనిలో సన్న్యాసను మందలించడం కాక మందహాసంతో మలచుకొనడము గోచరిస్తూనే ఉంది.

నేటికాలంలో కుటుంబాలలోని దంపతుల జీవనాలు చాలావరకు చాలా శోచనీయంగా ఉన్నవి. లోకులందరూ వివాహమనేది ఉండితీరాలని, అదే నాగరికధర్మం అని అంటున్నారు. కాని సరిగా సర్దుకోలేకపోతున్నారు. ఒకరొకరి మనస్సులు సర్దుబాటయితే అన్నీ సర్దుకుంటాయి. అసలు మనస్సులన్నీ కలుషములయిన ఈ దినాలలో ఆదర్శదంపతులను, ఆదిదంపతులను అనుసరించమంటే అందరూ ఆ పనిచేయలేకుండా ఉన్నారు. దాంపత్య పరమార్థం గుర్తించడానికి వాల్మీకి రామాయణం చదవడం మంచిదే. అందరూ చదవలేరు. కథలు చదవగలవాళ్ళు అసలు చదవలేరు. కథలు సుకుమారంగా చదివేవారి అభిరుచినిలాగిపట్టి అనుకూలంగా తగిన శిక్షణకూడా ఇవ్వాలని మునిమాణిక్యం తలచి ఉంటారు. తత్ఫలంగా ఇటువంటి సుఖశృంగారమతిని ఉత్పాదించే కథాకావ్యం రచించారు. సుఖశృంగారమతిలో క్రీడావినోదమతి కలిసి

ఉంటే హాస్యశృంగారజీవితం కలుగుతుంది. ధ్యానబిందూప నిషత్తులో సూత్రితమయిన ఈ అంశమే ఇట్లా నిధ్యాన ములో అవతరించడము లోకానికి సహాయోగం ఇస్తుంది. ఇటువంటి కథాసాహిత్యం ఎంతకాలం నిలుస్తుంది? అని ఎవరయినా ప్రశ్నించడమును నేను అభిమానించను. "ఏదయినా సాహిత్యము ఎంతో కాలము ఎందుకుండాలి?" "ఏ సాహిత్యమయినా ఎంతో కాలము ఎందుకుండదు?" అని అనుయాయులద్వారా ఎదురుప్రశ్న వేయించాలని పిస్తుంది. ఎక్కడయినా ఆ సాహిత్యం ఆ సాహిత్యంగా బ్రతకనక్కర లేదు. ఒక సాహిత్యంద్వారా ఒకవిశేషం కలుగుతుంది. ఆ విశేషము రూపంగా ఆ సాహిత్యం నిలిచినట్లు. అట్లే ఏ కవికానీ కవిగా నిలవనక్కర లేదు. కావ్యంగా నిలిస్తే చాలు. కావ్యమయినా తద్విశేషంగా నిలిచినా చాలు. వాల్మీకి ఇప్పటిదాకా ఉన్నా, వ్యాసుడు నేడు కనపడినా, కాళిదాసు మళ్లీ పుట్టినా తమ విశేషా లను స్వయంగా తాము ఎంత చెప్పుకొన్నప్పటికి ఈ నాడు మనలోకం ఏమీ మన్నన చేసేటట్లు లేదు. అందుకనే వారి కావ్యాల ఆదర్శాలలో వారుంటారు. ఇటువంటివాటికిన్నీ ఇదే పరిస్థితి. లోకంలో తన కర్త వ్యాన్ని నిర్వహించవలసిన ప్రతివ్యక్తి మేరువుమాదిరి ఉండాల్సిన అవసరంలేదు, కర్తవ్యమును కర్తవ్యముగా భావించేవారందరూ లోకశక్తిగా నిలుస్తారు. ముని

మాణిక్యంవారి రచనలు సాహిత్యాదర్శాలుగా ఎన్నిక్షై, యినా ఉండటానికి ఏమీ అభ్యంతరాలు కన్పడటంలేదు.

పాఠకుడు ప్రతికథనూ ఆత్మీయంగా భావించి సహృదయ సంవాదం పొందాలి. అప్పుడే ఆస్వాదన సఫల మవుతుంది. ఈ చతుష్టయంలోని "శర్మ" కాళిదాసు యక్షుని వంటివాడు. కాళిదాసు యక్షుణ్ణి చిరకాలం ఉండేటట్లు చేశాడు. యక్షభార్య అక్కడ అనామి. శర్మభార్య ఇక్కడ జానకి. ఈ జానకి శర్మదగ్గరే చేరువగా ఉండిపోతుంది. జానకీ శర్మదాంపత్యం విశేషాంశమును విడిచి పెడితే సర్వ దాంపత్య మవుతుంది. ప్రతిపాఠకునకూ సచేతస్త్వమిచ్చి హృదయసంవాదం కూర్చకల ప్రతిభ, సముల్లాసం పొందడం అవసరము. సహృదయ భావకుల ప్రతిభా సముల్లాసానికి ఇటువంటివి సమకాలంలో చాలా కావాలి. ఇది జానకీ శర్మ కథా కావ్యస్థాపన. ఈ కథానిర్మాత మునిమాణిక్యం నరసింహారావుగారిని గురించి నేను విశేషాలు ఎందుకు చెప్పాలి? ఆ విశేషాలు ఏవయినా ఉంటే కథాస్వాదనలో మనకెందు కుపకరిస్తాయి? "కవి తన అనుభవాన్ని కావ్యంలో నిబంధిస్తాడు" అని అనే దుర్బలత్వం నాలో లేదు. భావయోగంలో భాసించినదాన్ని కవి బంధిస్తాడు. అదీగాక, ఎవరు ఎట్లా వ్రాస్తే మనకేం-ఆ వ్రాత మనకు తగినంత భావోల్లాసం ఇస్తున్నది కదా? అది చాలు. పానకంలో ఇతరము లెందుకు? నాయీ

స్థాపస ప్రశీతల ప్రపానక ప్రాస్వాదంలో ప్రణాళిక. ఆస్వాద్యమంతా ఆస్వాదించి పానీపాత్ర చషకమును దూరముంచినట్లు కావ్యాస్వాదం అయిన తరువాత కావ్యాన్ని దూరముంచేటప్పుడు 'స్థాపన' కూడా స్థాపించండి. అది నాకు మీకు మనకందరకూ అభీష్టం—
'అస్తు'.

---

# శర్మ కాఫీ తాగాడు

అమ్మయ్య ! శర్మ కాఫీ తాగాడు.

ఊరికే తాగాడు ! ఎంత రస గంగాధరం జరిగిపోయిన తరువాత !

ఈ రసవత్తరమైన గ్రంథానికి ప్రొద్దున జానకి ఇంకా ఏం నిద్రండీ ! లేవండి. మొఖం కడుక్కోండి. అనే వాక్యాలతో మంగళాచరణము జరిగింది. శర్మ చటుక్కున లేచి విధేయతతో ముఖంకడుక్కున్నాడు. స్నానంచేయమన్నది; చేశాడు. ఒళ్ళు తుడుచుకోమని తువాలా ఇచ్చింది. తుడుచుకొన్నాడు.

శర్మ వ్యవహారం ఎల్లాగ ఉన్నదీ అంటే, ఆపిల్ల యేది చెయ్యమంటే అది చేసేలాగున్నాడు ! కూర్చోమంటే కూర్చోటం, నిల్చోమంటే నుల్చోటం ! పడుకోమంటే పడుకోటం ! ఆ అమ్మాయి గీచిన గీటుదాటడు ! అదీ ఇప్పటి సంగతి.

ఇల్లాగ తయారు కాకపూర్వము శర్మ నిక్షేపంలాంటి కుఱ్ఱవాడు. సంస్కృత సాహిత్యంలో సముపలబ్ధమయ్యే మాధుర్యాన్ని అనుభవించిన సహృదయుడు. అటువంటివాడు

అజ్ఞానుభావాలైన ఆ పిల్ల చేతిలో పడిపోయి ఇల్లాగ తయారై నాడు.

ఇంత భార్యా విధేయుడు ఎందుకు కావలసి వచ్చిందో నేను చెప్పలేను. ఎల్లాగ మారిపోయినాడో చూడండి. ఇప్పుడు శర్మ ముఖం కడుక్కొన్నాడు, అతనికి కాఫీ కావాలె. కాఫీ అని అడగడం జానకిని !

కాఫీ కావాలా లేదా అని అడిగి అప్పటికింకా ఆ అమ్మాయి అల్లాంటి ప్రశ్నం ఏమీ చేయలేదని శాస్త్రి వెంటనే, "ఏమ్ ఎందుకు కాఫీ కాదులేదా. యింత ప్రొద్దెక్కింది కదా, కాఫీ కాకపోతే ఎట్లా గడుస్తున్నాప్రు, పూఁయ్, తొందరగా కానీ" అని కోప్పడడేం ?

కోప్పడడు !

అదే వచ్చిన కర్మం !

పైగా మెదలకుండా వెళ్ళిపోయి తనగదిలో కూర్చొని ఏదో పుస్తకం చూస్తూ ఉంటాడు ! శర్మను కాఫీ గొంతుకలో పడంది ఒక్క అక్షరమైనా మనస్సున ఎక్కదు. కాఫీ అనే రెండు అక్షరాలు తప్ప ఇంకేమీ కనబడవు కదా, అల్లాంటప్పుడు ఈ నోరులేని తనము ఏమిటి ?

పోనీ కోప్పడే శక్తి సామర్థ్యాలు, ధైర్య సాహసాలూ శర్మకు లేవనే ఒప్పుకొందాము. అయితేమాటుకు, 'కాఫీ' అని

రెండు అక్షరాలు అంటానికి జంకుఎందుకో! అది కాంతా సమ్మితము ఎందుకు కాదో, తెలియటలేదు!

అతని మనోగతమైన అభిప్రాయం ఇది!

కాఫీ తయారైన తరువాత, జానకి ఆ కాఫీని వెండి గ్లాసుల్లో ఆరపోసి, తీసుకొచ్చి భర్త పాదాలముందు పెట్టి హే ప్రియా, "ఇదం మధురం కాఫీకా పానీయం పిబంతు" అని మృదుమధుర స్వరంతో అనవలయునని శర్మ కోరిక.

అయ్యో పిచ్చిశర్మా, అల్లాంటి వినయశీలయైన భార్య ఉండటం ఎన్ని పూర్వజన్మల సుకృతానికి ఫలితమో! నీవు అంత పుణ్యం చేసుకోలేదు. జానకి వంటఇంట్లో నుంచి కదలదు. గృహసామ్రాజ్యానికి ఆమె మహారాజ్ఞి. ఆ అంతఃపురంలో నుంచి కేక వేస్తుంది 'ఏమండోయ్ రావాలె' అని!

ఎందుకు రావాలో చెప్పదు. ఆ రమ్మనడమైనా మర్యాదగా మధురంగా అనదు. రావాలె అంటుంది. ఎందుకో! ఆజ్ఞ ఇచ్చినట్లు పిలుస్తుందిరమ్మని. ఎందుకివ్వదూ, శర్మ సంగతి బాగా కనిపెట్టిన తరువాత! ఆజ్ఞ ఇయ్యటమేకాదు. చెవులు పట్టుకొని ఆడిస్తుంది కూడాను!

శర్మ అయినా నేనురాను, కాఫీ ఇక్కడకు తీసుకొనిరా నేను చదువుకొంటున్నాను అని అంటే కొంత దర్జాగాఉండేది!

ఈ తెలివితక్కువ శర్మ నోటివెంట అల్లాంటి మాటలే రావు. పిల్లిలాగవచ్చి భార్యకు ఎదురుగా నిలబడి 'ఎందుకూ పిల్చావూ ?' అన్నాడు.

ఇంకా శర్మకు భయమే ఆ అమ్మాయి ఏమన్నా అంటుందని! అందుకని జానకినిచూచి శర్మ ముసిముసి నవ్వులు నవ్వాడు !

జానకి శర్మను మర్యాదగా అయినా ఆహ్వానించి, కూర్చోమని కాఫీ ఇయ్యలేదు. కాఫీ అక్కరలేదా అన్నది స్మితకటాక్ష వీక్షణాదులచే శృంగారం ఒలకబోస్తూ.

పాపం, శర్మ కాఫీ అక్కరలేదని ఎప్పుడైనా అన్నాడా! ఆ ప్రశ్న ఎందుకూ ? జానకి అంత కఠినంగా అడిగినా శర్మ ఏమీ అనుకోలేదు. ఆ మాటకు జవాబుగా ఒక చిరునవ్వు నవ్వినాడు.

ఇప్పుడు జానకి కొంచెంగా ప్రసన్నవదన అయినది. భర్త తాను చెప్పినట్లు వింటూ ఉన్నాడు అనే గర్వంతోనూ ఆనందంతోనూ.

శర్మ వినమ్రుడై దరహాస వికసిత వదనంతో కూర్చున్న తరువాత అయినా జానకి ముద్దుగా సమీపించి కాఫీ తాగండి అని అనిఉన్నట్లయితే శర్మ మహదానందంతో తలమున్కలయ్యేవాడు.

జానకి ఆముద్దు అయినా తీర్చలేదు. మాట్లాడకుండా వెండిగ్లాసు అతని చేతికిచ్చింది. ఆ ఇయ్యటంలో ఎంత వయ్యారం వలకపోసింది ! ఎంత హస్తవిన్యాసం ప్రదర్శించింది!

ఇన్ని పోకళ్ళు పోగలపిల్ల ఒక్కమాట మాట్లాడ లేదా ఏమటి ? నోటి ముత్యాలు రాలిపోతయ్యా ! జానకి కలికిందిగాని శర్మను కన్నెత్తిచూడలేదు. నోరువిప్పి అతనితో మాట్లాడనూలేదు. కాఫీగ్లాసు అందించి ఊరుకొన్నది.

శర్మ తలఎత్తకుండా గ్లాసు తీసుకొని ఆలోచించటం మొదలుపెట్టాడు. పిచ్చి కాకపోతే ఎందుకొచ్చిన ఆలోచన అది ! ఆ కాఫీకాస్తా నోట్లోపోసుకొని తనదారిని తాను వెళ్ళి పోతే కొన్ని ధీరలక్షణాలు ఉన్నయ్యి అని అయినా సంతో షించే వాళ్ళం !

శర్మ ఉత్తమ నాయక లక్షణాలన్నీ తగలేస్తున్నాడు. బి. ఎ. లో నవరసగంగాధర కావ్యాలంకార సంగ్రహమూ, ప్రతాపరుద్రీయమూ, ఆంధ్ర ధ్వన్యాలోకమూ మొదలైన పుస్తకాలు చదివిన పండితుడు, ఇల్లాగ సామాన్యుడై పోయి నాడూ అంటే, ఆ పిల్ల దగ్గర ఏదో మంత్రశక్తి ఉన్నదీ అని ఒప్పుకోక తప్పదు.

శర్మ గ్లాసు ముందుపెట్టుకొని ఆ గ్లాసువంకా, ఆ పిల్ల వంకా, అటునుంచి ఇటూ, ఇటునుంచి అటూ, చూపులు త్రిప్పుతూ, చిరునవ్వులను ప్రసరిస్తూ కూర్చున్నాడు.

ఆ సమయంలో అతనికి చాలా అశాస్త్రీయమైన ఆలోచనలూ, అసంస్కృత అనార్య అసభ్య భావాలూ వచ్చినవని చెప్పటానికి నాకే సిగ్గుగా ఉన్నది.

అప్రాచ్య చదువులవల్ల ఇల్లాంటి మనఃప్రవృత్తులు కలుగుతూ ఉన్నవి. ధర్మశాస్త్రాల ప్రాబల్యము నిలిగి రావాలనీ, కుఱ్ఱవాళ్ళకు వేదాలయందు ప్రసన్నబుద్ధి కలగాలనీ సనాతనులు అందుకనే గోల పెడుతున్నారు.

ఆ పిల్ల అప్పుడే స్నానంచేసి ఉతికిన మామిడిచిగురు రంగుచీర కట్టుకొన్నదికదా, ఆ అమ్మాయి భుజంమీద చెయ్యి వెయ్యాలనీ తల నిమరాలనీ ఆమె శరీరమునందుగల సౌందర్య సీమలను పరామర్శ చెయ్యాలని బుద్ధిపుట్టడము అనేది కేవలము అసంస్కృత వ్యాపారమునకు సంబంధించిన ఆలోచనే కదా !

ఆ అమ్మాయి చేతులకు బంగారపు గాజులూ, వాని వెనకాల కాస్త సిగ్గుపడుతూ రాగహృదయంగల తేనెగాజులూ ఉన్నవి. తేనెగాజులు ముందుండి వాని వెనకాల మెరుస్తూ బంగారపు గాజులు ఉండాలట ! అందుకని శర్మ, ఆ పిల్ల చేతులను తన చేతులలోకి తీసికొని ఈ పద్ధతిలో గాజుల కూర్పును దిద్ది ఏదో తృప్తిగా ఆనందంగా చూశాడు.

ఈ విషయంలో శర్మకు స్థిరబుద్ధికూడా లేదు. నిన్న వద్దన్నాడూ! బంగారపు గాజులు ముందు వుండాలన్నాడు.

ఇవ్వాళొక వేసాల ఉండాలంటాడు. ఇటువంటివాళ్లు ఉండబట్టే 'స్థిరమైన నడువడి జనులకందరకు వలయు' రామనాథశాస్త్రి గొంతెత్తి గోలపెట్టేది. 'ఇంత అస్థిరబుద్ధి ఉండబట్టే అతడంత చులకన అయినాడు!'

శర్మ ఆ స్త్రీ దృష్టిలో కొంచెము కావటానికి ఇంకా బోలెడు కారణాలున్నవి. శర్మ అనవసరమైన విషయాలలో జోక్యం కలుగజేసుకొంటాడు. ఒక్క విషయం చెబుతాను.

ఆ స్త్రీ తలలో పూలు ఎల్లా పెట్టుకొంటే నీకెందుకూ? చూచి ఊరుకోరాదూ! ఆ విషయంలో లేనిపోని తగూ తెచ్చి పెట్టుకొంటాడు. పూలు మాలగా గుచ్చి ముచ్చటముడి పైన అర్ధచంద్రాకారంగా పెట్టుకోమని శర్మ కోరాడు. ఆ స్త్రీ ఆ మాటలను కించిత్తయినా గౌరవించక పూల చెండును నిర్లక్ష్యంగా వాలుజడలో గుచ్చి ఊరుకొంటుంది. శర్మ ఎంతో చిన్నబుచ్చుకొని బ్రతిమలాడుతాడు తాను చెప్పినట్లు చేయుమని! ఆ అమ్మాయి ఊరుకోండి, ఎవరైనా వింటే నవ్వుతారు పూలు ఎక్కడైనా అర్ధచంద్రాకారంగా పెట్టుకొంటారటండీ అంటూ పకపకానవ్వి శర్మ నట్టి తెలివితక్కువగా మాట్లాడినట్లు పేళనచేస్తోంది.

ఆ స్త్రీ తనని ఎదిరించి ఇల్లాగ తన యిష్టమువచ్చినట్లు కేశసంస్కారమూ అలంకారమూ చేసుకొంటూఉంటే శర్మ ఎక్కడికక్కడికి సరిపుచ్చుకొంటూ, సర్దుకుపోతూ ఉన్న

దాంతో తృప్తిపడుతూ లభించిన దానితోనే సంతోషిస్తూ కాలం గడిపేస్తున్నాడు పాపం !

ఆ కాఫీగిన్నె ముందు పెట్టుకొని శర్మ జానకి వంక చూస్తూ ఏదో అవ్యక్తమైన హర్షాది చతుస్త్రింశద్భావాల లోనూ, మునుగుతూ తేలుతూ కళ్ళుమూస్తూ తెరుస్తూ సగం మూస్తూ సగం తెరుస్తూ కొన్ని నిమిషాలు గడిపాడు.

ఆ తరువాత శర్మ జానకిని ఒకకన్నుతో మాత్రం చూస్తూ కొంతకాలం గడిపినాడు. ఆ తరువాత ఈ కన్ను మూసి ఆ కన్నుతోనూ, ఆ కన్ను మూసి ఈ కన్నుతోనూ చూచి చివరకు రెండు కళ్ళూ మూసికొని కూర్చున్నాడు.

శర్మ ఇంత వెఱ్ఱివాడేమా అని నాకూ ఆశ్చర్యం కలుగుతూ వున్నది. ఏ కన్నుతో చూస్తే నేమి ! జానకి జానకే గాని ఊర్వశి కాదుకదా ?

శర్మ ఇల్లాగ కళ్ళుమూసుకొని ఉండటం కనిపెట్టి జానకి చాలా ఆశ్చర్యంతో అన్నది.

"ఏమిటది ? తాగరేం ?"

శర్మ ఏమీ మాట్లాడలేదు.

చిరునవ్వు నవ్వి ఊరుకొన్నాడు.

ఆ నిమిషములో శర్మ చాలా ఎక్కువైన హర్షమును అనుభవిస్తూ ఉన్నమాట మాత్రం నిజం.

ప్రియురాలి సామీప్యమూ, ప్రసన్నతా, ప్రియవచనాలూ అతనికి హాస్యమును కలుగజేసి ఉంటవి.

జానకి అన్నమాటలు అతనిని సుషుప్త్యవస్థలోనుంచి బయట పడవేసినవి. శర్మ కళ్ళు తెరచి కాఫీ గ్లాసు పెదవుల దాకా తీసుకొని వెళ్ళికూడా వెంటనే అక్కడ చటుక్కున ఆగిపోయినాడు.

జానకి శర్మ చేస్తూవున్న వికృతచేష్టలన్నీ గమనించింది. ఆ అమ్మాయి ఏమనుకున్నదో నేను చెప్పలేను. బయటికి మాత్రం విసుగుచూపుతూ, 'కాఫీ త్రాగరేమండీ, ఏమిటా విచారం?' అనిమాత్రం అన్నది.

శర్మ ఉలిక్కిపడి చిరునవ్వుతో కాఫీని ఆహ్వానించి కొంచెం కొంచెంగా త్రాగడం మొదలుపెట్టాడు. గుటుక్కున త్రాగి వెళ్ళిపోకూడదూ.

ఊహు అల్లాగ త్రాగడు!

అంతా ఒక గుక్కలో త్రాగేస్తే అక్కడ ఉండటానికి తనకు తగినంత కారణం ఉండదేమో అన్న భయంతో, శర్మ కాఫీని కొద్దికొద్దిగా పెదవులతో త్రాగుతున్నాడని మాత్రం నేను చెప్పగలను.

వేడి వేడి కాఫీ త్రాగి ఉల్లాసంతో ఆ పిల్లతో సరసాలాడుతూ ఎంతసేపన్నా కూర్చోవచ్చు నిజానికి. కాని శర్మకు అల్లా మాట్లాడటం తెలియదు.

సంస్కృత పుస్తకాలలో ఎక్కడా భార్యతో ఎల్లా మాట్లాడాలో చెప్పలేదట ! అల్లాంటి ప్రసంగాలే లేవట !

ఉన్నా, ఉద్యానవనంలోనూ, చలువరాతి తిన్నెల పైనా, గోరువంకలూ, చిలుకలూ ఉన్నటువంటి సమయంలో, ప్రియురాలుతో జరిపే ప్రసంగాలు ఉన్నాయిగాని వంటఇంట్లో స్వంత భార్యతో అనవలసిన ముక్కలు సంస్కృత సరస సాహిత్యంలో ఎక్కడా కనుపించలేదట ! మాధురీ దర్శన పర మార్థమైన సర్వమంగళ మనోహార సృష్టి అంతా పరకీయా సంబంధియే కాని, స్వకీయ కాంతాకలాపాలు కావుట.

శర్మ కాఫీ గుటుక్కున మింగకుండా ఆలస్యం చెయ్య టానికి కారణం అదే !

ఇల్లాగే శర్మ జానకివంక చూస్తూఉంటే చివరకు ఆ అమ్మాయి 'ఎందుకండీ అల్లాగ చూస్తారూ ?' అని అడిగింది.

శర్మ చాలాసేపు ఆలోచించవలసి వచ్చింది జవాబు కోరకు. ఆలోచించి ఆలోచించి చివరకు అన్నాడు. "ఎందు కేమిటి. పెళ్ళాన్ని చూచుకోరా ?" అని.

జానకి నిజమేకాబోలు ననుకొన్నది. అందుకు మొగ వాళ్ళు అల్లాగే పెళ్ళాలను చూస్తారు కాబోలునని అనుకొని, "పోనీ చూడ్డండి" అని కాస్త దగ్గరకు జరిగింది.

శర్మకూడా ఆమెను అభిముఖంగా జరిగాను.

తరువాత

ఆ పిల్ల అటునుంచీ

శర్మ ఇటునుంచీ

ఒకరికి దగ్గరగా ఒకరు

జరిగి, జరిగి

సమీపించి, సమీపించి

ఒకరు నొకరు కౌగలించుకొన్నారు.

అతను ఆమెను ఆదరించుకొన్నాడు. ఆమె పిట్టలాగ అతని కౌగిలిలో ఒదిగిపోయింది. యౌవన దశావిర్భావమున ఉన్న ఆ నూతన దంపతులు, కౌగిళ్ళల్లో ఎంతసేపు ఉండి పోయినారో తెలియదు.

ఇట్లు ఎంతసేపు ఉన్నారో వారే చెప్పలేరు, నేనేమి చెప్పగలను.

కొంతసేపటికి జానకికి మెలకువ వచ్చినది. చాల్లే ఊరు కోండి, మరీ చిన్నతనం వస్తున్న దేం? అని వదలించుకొన్నది.

ఆ పైన దంపతులు విడిపోవటమున్నూ, వేరువేరుగా నిలబడటమున్నూ జరిగింది.

స్వేదాంబు సాంద్ర కణశాలి కపోల పాలి

రక్తః స్మితాలస విలోకన వందనీయా,

ఆనంద మంకురయతి స్మరణేన కాపి
రమ్యా దశా మనసిమే మదిరేక్షణాయాః ॥

'స్వేదోదక కణాలతో శోభించే కపోలపాళి కలిగినట్టిన్నీ, లోలోపలి చిరునగవుచేత అలసమైన చూపులవలన ప్రశంసింప తగినట్టిన్నీ, ఆ మదిరేక్షణయొక్క, రమణీయము అనిర్వాచ నీయము అయిన అవస్థ మనస్సులో స్మరణచేయగా 'ఆనందము అంకురిస్తున్నది సుమా' అని శ్లోకమూ తాత్పర్యమూ కూడా రాగవరసతో చదువుతూ, ఆ గిన్నెలో ఉన్న కాఫీని శర్మ గొంతుకలో పోసుకొన్నాడు.

అమ్మయ్య!
శర్మ కాఫీ తాగాడు.

ఊరికే తాగాడూ! ఇంత రసగంగాధరం జరిగిపోయిన తరువాత తాగాడు.

# ప్రకరణ భంగం

శర్మ సంస్కృతం చదువుకున్న మహాపండితుడని ఇది వరకే చెప్పాను. మహామహులైన విద్వద్గురుచరణ సన్నిధానంలో శాస్త్రపఠనం చేశాడు. రసపత్కవితా కళానిధి. శృంగార రసమును గురించి క్షుణ్ణంగా చదివి దాని నిజతత్వమును జీర్ణించుకున్నాడు.

ఇటువంటి విద్వాంసుడు స్వకీయురాలైన జానకీ సాన్నిధ్యంలో అశాస్త్రీయంగా ప్రవర్తిస్తూ ఉన్నాడూ అంటే, పండితులూ కవులూ సహించలేకుండా ఉన్నారు.

శర్మ ఎట్లాంటివాడు?

కాంతా హృదయ స్వభావాన్ని గురించి సంస్కృత సాహిత్యంలో ఉపలబ్ధమయ్యే సాహిత్య సంపదను అంతా చూరగొన్న సరసుడు.

శృంగారరస ప్రధానములైన కాంతాలంబనాలైన కావ్యాలను చదివిన సరసహృదయుడు.

ఇది శాస్త్రసమ్మతము, ఇదికాదూ అని తెలిసిన విద్వాంసుడు.

ఇల్లాంటివాడు శృంగార లీలల్లో శాస్త్రమర్యాదలను అతిక్రమిస్తున్నాడూ అంటే ఎంత శోచనీయమో నేను వేరే చెప్పనక్కర లేదు.

శర్మ కావ్యాలను ఎక్కువగా చదవటం చేతనే అతనికి మతి చెడిందని నా అభిప్రాయం.

అయితే శర్మ బొత్తిగా పిచ్చివాడై పోయినాడనీ నేను అనటంలేదు. అన్ని లౌకిక వ్యవహారాలలోనూ అతడు తెలివిగానే ప్రవర్తిస్తున్నాడు. భార్యా విషయంలోనే అతని ప్రవర్తన ఈ అనుమానానికి ఆస్పదం అవుతూ ఉన్నది.

ఈ విపరీత అనన్య సామాన్య ప్రవర్తనను ప్రణయ పూరితమైన అతని హృదయంలో కలిగిన స్పందనానికి ఫలితము అనీ, కళాప్రసక్తమైన రసవద్వినోద ప్రదర్శనమనీ అనేవాళ్ళు ఉన్నారు. అయినా పండితుడు అయిఉండి అశాస్త్రీయంగా ప్రవర్తిస్తే ఎవ్వరూ ఊరుకోరు.

శర్మ మొదటనుంచీ ఇల్లాంటివాడే అయి ఉన్నట్లయితే నేను ఇంతగా విచారపడేవాణ్ణి కాదు. మొదట్లో శర్మ నిక్షేపం లాంటి బిడ్డ. వజ్రపు తునక. శాస్త్రమర్యాదను ఎప్పుడూ అతిక్రమించి ఎఱుగడు.

జానకి వంటయింట్లో పనిచేసుకొంటూ ఉంటే తాను ముందు గదిలో కూర్చొని పద్యరచన చేస్తూ వుండేవాడు. పట్టపగలు వంటఇంట్లోకి వెళ్ళి భార్యను పలకరించటం శాస్త్ర

సమ్మతం కాదు. భార్య అసమాన సౌందర్య విభాసిని కావచ్చు. చతురవచఃకౌశలము కలిగినది కావచ్చు. ఆమె సాన్నిహిత్యము నిరవధిక ఆనందదాయి కావచ్చు. కాని పగలే వెళ్ళి ఆమెతో మాట్లాడటం అనేది అనివార్య సాంప్రదాయమనీ, అల్లాంటి చేష్టకు అనౌచిత్యదోషం పడుతుందనీ శర్మ బాగా గుర్తెరిగిన వాడు.

ఇల్లాంటి శర్మ ఇప్పుడు ఎల్లాగ తయారైనాడో చూడండి. మతి తిరిగిపోయింది కర్మం!

ఇప్పుడు శర్మ ఆ వంటఇల్లు వదలకుండా ఉంటున్నాడు. ఆ పిల్ల కొంగుపట్టుకుని వేలాడుతాడు!

అయ్యయ్యో! ఎక్కడైనా ఉందా ఇంత అన్యాయం!

శర్మ తనగదిలో తాను కూర్చుని తనచదువు చదువు కోడుగద! పుస్తకాలు తీసుకెళ్ళి ఆ అమ్మాయికి ఎదురుగా కూర్చుంటాడు. అక్కడే తనకు చదువు బాగా సాగుతుందట! ఎక్కడైనా ఉందా ఈ అన్యాయం.

సౌందర్య సౌభాగ్యాలను భోగించ వలసింది సాహిత్యంలో కాని కాంతా సన్నిధానంలో కాదే! కాంతా లంబనాలైన కావ్యాలపట్ల అనురక్తి ఉన్నా కాంతలపట్ల విరక్తి ఉండాలనేగదా శాస్త్రప్రవచనము. అలాంటప్పుడు శర్మ చేస్తూఉన్న పని ఎట్లా శాస్త్రసమ్మతమైనదీ అని నా ప్రశ్న.

ఆ శర్మ అక్కడ కూర్చుని పోనీ ఏమైనా చదువు తున్నాడా, అదీ లేదు.

ఎంతసేపటికీ శర్మ ఆ అమ్మాయి ముఖంవంక చూస్తాం టాడేగాని పుస్తకాలవంక చూచిన పాపానపోడే!

ఊరికే ఆపిల్లను ఇటునుంచీ అటునుంచీ, దగ్గరనుంచీ దూరాన్నుంచి చూస్తూ ఉండటం ఏం చదువూ అని నా ప్రశ్న!

మహాభోగి, రసికప్రభువు, సౌందర్యార్చకుడు అయిన పండితరాజు కూడా ఇల్లాగ లవంగి సన్నిధానంలో శాస్త్ర పఠనం చేసినాడని ఎవరూ చెప్పలేదు. ఇది శర్మకు ఎత్తిన పిచ్చేగాని మరియొకటిగాదు.

భార్యను ప్రేమించే వాళ్ళను నేను చాలామందిని చూశాను. నేనుమట్టుకు ఎఱుగను గనకనా భార్యను ప్రేమిం చటం అంటే ఏమిటో! కాని ఇంత అన్యాయం ఎక్కడా చూడ లేను. పసిపిల్లవాడు తల్లికొంగు పట్టుకొని తిరిగేలాగున శర్మ జానకి కొంగు పట్టుకొని తిరుగుతున్నాడు. ఇది ఎంత అశాస్త్రీ యమైనపనో అతడు తెలుసుకోక పోవటమే చాలా విచారకర మైన విషయము.

అల్లాగ చూస్తూ ఊరుకొన్నా కొంతనయమే. ఇంకా విచిత్రమైన పనులు చేస్తున్నాడు కాబట్టే నేను మాట్లాడవలసి వచ్చింది. లేకపోతే నేను ఈ విషయమై పట్టించుకొనేవాణ్ణి కాదు.

శాస్త్ర నియమాలను పెత్తేను అటూ ఇటూ పోతూ ఉంటే అంత అనుకోవలసినది ఏమీ ఉండదు కాని ఆ మర్యాద లను బొత్తిగా మంటకలిపేస్తూ ఉంటేనే ఎవరికైనా చిరాకుగా ఉంటుంది.

ఇప్పుడు చూడండి మాటవరుసకు చెపుతాను. శర్మ ఆ జానకి ఎదురుగా కూర్చున్నాడా, కూర్చున్నవాడు అల్లాగ బుద్ధిగలిగి కూర్చుంటే ఎవ్వరే మంటారు. ఏదో ఒక పిచ్చిపని చేస్తూ ఉంటె !

ఏమైంది అంటే,

జానకీ శర్మా ఒకరికి ఎదురుగా ఒకరు కూర్చున్నారు. శర్మ ఊరికే నవ్వుతున్నాడు. "ఇంట్లో ఉండేదాన్నే అయితిని. రోజూ కనపడే మనిషినే అయితిని. నన్ను ఊరికే ఇల్లా చూస్తాడేం ఈ అబ్బాయి" అని అనుకొన్నదో ఏమో ఆ పిల్ల ఇటు తిరిగి ఉన్నదల్లా గిరుక్కున అటుతిరిగింది.

తిరిగితే శర్మకొచ్చిన నష్టం ఏముంది ! శర్మ ఊరుకో కూడదూ !

ఊరుకోక శర్మ 'ఏయ్, జానకీ' అని పిలిచాడు. ఆపిల్ల పలక లేదు. పలక్కపోతే పోనీలే అని ఊరుకోవాలా లేకపోతే, "ఏయ్ ఏయ్ నిన్నే జానకీ ఏయ్ ఏయ్, ఏయ్ జానకీ ఏయ్" అంటూ విసుగులేకుండా పిలవాలా? తాను అన్నిసార్లు పిలిచినా ఆ పిల్ల పలక లేదన్న కోపంకూడా లేదు శర్మకు. అదీ విచిత్రం.

అంత చదువు చదువుకొన్న పండితుడే తను, తనను, ఒకపిల్ల, అజ్ఞానురాలైన పిల్ల, తృణీకరిస్తూ ఉంటే ఎందుకు కోపంరాదో నాకు అర్థం కావటంలేదు. చదువు కొన్నందుకు తన సంగతి తాను కాస్త తెలుసుకోవాలె. తన గౌరవం తాను నిలుపుకోవాలె. "ఏయ్ జానకీ, ఏయ్ జానకీ ఇటుతిరుగు, నిన్నే ఏయ్, జానకీ" అని ఒకటే పిలవటమా ! దానికేమైనా అంతు ఉండవద్దూ !

జానకి భలేపనిచేసింది. నిజంగా ఆ అమ్మాయే నయం. కాస్త ఆత్మాభిమానం మర్యాద తెలిసిన పిల్ల! ఎన్ని పిలచినా ఆఁ అనలేదు ఊఁ అనలేదు.

ఇల్లా జరిగిందే అని నాకే ఎంతో కష్టంగా ఉందే శర్మకు ఎల్లా ఉండాలె ! నిజానికి, అవమానంతో కృంగి కృశించి పోవాలిసిన పనిగదా, శర్మ ఏముఖం పెట్టుకొని అల్లాగ ఇంకా ఆ పిల్లను పిలుస్తాడో నాకు అర్థం కావటంలేదు.

ఆ పిల్ల శర్మవంక కన్నెత్తి అయినా చూడలేదు, అతని వైపుకు తిరగనూలేదు. అంటే తిరిగి ఏదో కూర తరుక్కుంటూ ఉన్నది.

ఇది చాలా తమాషా అయిన సన్నివేశము మటుకు అవును. శర్మకు ఏంచేయాలిసింది తోచలేదు. తోచకపోవటంలో వైపరీత్యమూ లేదు. శర్మ కళ్ళుమూసుకొని కణతలు నొక్కుకుంటూ కాసేపు ఆలోచించాడు.

ఎట్లాగయినా శాస్త్ర చదువుకొన్న వాడుఅయిన కారణం చేత శర్మకు శృంగార రసవత్కావ్యాలలో నుంచి ఒకశ్లోకం జ్ఞాపకానికి వచ్చింది.

గురుమధ్య గతామయా నతాంగీ
నిహతా నీరజకోరకేణ మందం
దరకుండల తాండవం నతభ్రూ
లతికం మామవలోక్య ఘూర్ణితాసీత్

అని !

శర్మ సంతోషంతో ఎగరటం మొదలు పెట్టాడు. అతడు ఆలోచిస్తున్న సమస్యకు సమాధానం దొరికింది ఈ శ్లోకంలో.

గురుజనులమధ్య ఉన్న ప్రియురాలును కమల ముకుళముతో ప్రియుడు, కొట్టగా ఆమె కుండలాలు కదులులాగున వంగి ప్రియుణ్ణి కోపంతో చూచిందిట ! కాబట్టి ఇప్పుడు చేయవలసింది ఏమిటి అంటే ఆపిల్లను నీరజ కోరకంతో కొట్టటమే !

శర్మ ఆపళంగా తన కర్తవ్యమును నిర్ణయించు కొన్న వాడై తన సమీపంలో నీరజ కోరకము లేకపోవటంచేత దొరికిన తోటకూరకాడ ఒకటిని తీసుకొని ఆమెపై విసిరాడు.

తాను కష్టించి చదివిన శృంగార సాహిత్యమూ జీర్ణించుకొన్న పరిపుష్ట భావనా సౌభాగ్యమూ ఈనాటికి ఈ విధంగా సౌందర్యార్చనకై తోడ్పడ్డవి.

అప్పటికీ కూడా జానకి మాట్లాడక పోయేటప్పటికి శర్మ దొరికిందల్లా తీసికొని కొట్టాడు. అరటికాయ చెక్కలూ, మెరపకాయ తొడిమలూ, కూరముక్కలు మొదలైనవి అన్నీ ఆమెపైన విసరడం సాగించినాడు.

ఇక్కడ ఒక్క క్షణంఆగి శర్మను కాస్త విమర్శించాలె. ఏది కనపడితే అది తీసుకొని ఆ అమాయకురాలిపై విసరట మేనా అని! ఇవ్వాళ తోటకూరకాడ అయింది, రేపు ఇంకొకటి అయినా ఇంతేగద! ఇందుకనే నేను గోలపెడుతూ ఉన్నది శృంగార విషయాలలో శర్మ నవ్యసిద్ధాంత ప్రతిపాదనా అభినవరచనా శాస్త్రమర్యాదలను అతిక్రమిస్తూ ఉన్నదీ అని!

౨

జానకి అప్పుడు ఏంచేయాలిసిందీ అంటే కొద్దిగా వంగి కుండలాలు కదిలేలాగునతొట్రుపాటుతో ప్రియుణ్ణి ఓరగంటితో చూడవలసింది. ఆ పిల్ల ఏమీ ఎరుగనట్టు ఊరుకొన్న దేగాని ప్రకరణంలో ఉన్నట్లు చేయలేదు. దాంతో శాస్త్రమర్యాద మళ్ళీ తప్పింది, ఇల్లాగ ప్రతివిషయమూ అశాస్త్రీయ కల్పం అయిపోయింది.

ఇంతటితో ఈ వ్యవహారం ఆగిపోయినా బాగుండేది! కాని ఆగిపోక ఇంకా చాలాదాకా పోయింది.

ఏమైందీ అంటే, ఆ పిల్ల నవ్వకపోయేసరికి శర్మ శాస్త్ర తెలిసినవాడు కాబట్టీ శాస్త్రమునందు ప్రమాణబుద్ధి కలవాడు కాబట్టీ ఏం చేశాడూ అంటే ఆమెను కొద్దిగా నవ్వించి శాస్త్ర మర్యాదను కాపాడదాము అనే ఉద్దేశంతో మెల్లిగా ఆమెను సమీపించాడు.

శర్మ రాకను జానకి చూడలేదు అటుతిరిగి ఉన్నది కాబట్టి. ఇటుతిరిగి ఉన్నట్లయితే వ్యవహారం బొత్తుగా చెడి పోయేది. అటుతిరిగి ఉండటమే నయమైంది.

శర్మ అల్లాగ సమీపించి ఆపిల్ల వీపుపైగా వంగి తన రెండు చేతులతోసహా ఆముగ్ధయొక్క నయనాలను గట్టిగా మూశాడు. ఆ పిల్ల కళ్ళు ఎంతో అందంగా ఉంటవి. రమణీయ మైన ఆకారం గలిగి తళుక్కు-తళుక్కు-మని మెరుస్తూఉంటవి.

అల్లాంటి సౌందర్య సౌభాగ్యాన్ని చూచి ఆనందించాలె గాని అరచేతులతో మరుగుపరచటం కాంతా సమ్మితమూ కాదు, శాస్త్రసమ్మతమూ కాదు.

అసలు ఆ కళ్ళు మూయటానికి తగినంత కారణం కూడా కనిపించదు. ఆ పిల్ల శర్మకు అభిముఖంగా ఉన్నట్లయితే 'అదిగో, నావంక ఊరికే కళ్ళు పెట్టుక చూస్తున్నది. అందుకనే నేనుమూశాను' అని అన్నా అనవచ్చు. కాని జానకి మరొక

దిక్కుకు చూస్తూ ఉండటం మూలాన, శర్మ అలాగ ఆ పిల్ల యొక్క శృంగార సుస్నిగ్ధములైన కపోల పాళిని కమనీయమైన నేత్ర ద్వయాన్ని చూడటం శుద్ధ తెలివితక్కువపని అయింది. అనవసరమూ వ్యర్థమూ కూడా అయింది.

ఆ కళ్ళ విషయమై ఒకపూర్వగాథ కూడా ఉన్నది. జానకి కార్యం నాడే ఈ కళ్ళవిషయమై కొంచెం చర్చ జరిగింది.

ఏమిటీ అంటే, ఆరోజున ఆ అమ్మాయికి అలంకారం చేస్తూ కళ్ళనిండా కాటుక పెట్టేటప్పుడు "దీనికింత పెద్ద కళ్ళు ఉన్న వేవమ్మా. ఎందుకబ్బా, భగవంతుడు దీనికి ఇంతలేసి కళ్లు పెట్టాడూ!" అని ఒకావిడ అన్నది.

ఆ తరువాత ఆ పిల్లకు కళ్ళు అంత విశాలమైనవిగా ఎందుకు ఏర్పడ్డవి అన్న విషయంపై చాలాసేపు చర్చజరిగింది. చివరకు మొగుణ్ణి బాగా చూసేందుకే ఆ రెండు కళ్ళూ అంత పెద్దవిగా ఏర్పడి వున్నవి అని తేలింది. కాని ఒక సందేహం కూడా కలిగింది కొందరికి. ఇంతలేసి కళ్ళతో చూస్తేనేగాని కనపడడా ఏమిటి ఆ మొగుడూ అని !

చివరకు అంతా ఒక మాట అన్నారు. కళ్ళు అంత పెద్దవిగా ఉన్నప్పుడు జానకి మొగుణ్ణి రెండు కళ్ళతోనూ చూడనక్కర లేదనీ ఒక్క కన్నుతో చూస్తే చాలుననీ !

తదారభ్య జానకి 'ఆయనను చూడటానికి ఈ రెండు కళ్ళూ చాలవమ్మా' అని అంటూ ఉన్నా సాధారణంగా ఒక కంటితోనే చూస్తూ, అంటే ఒక కన్ను మూసి ఒక కంటితోనే చూస్తూ, ఉండేది! శర్మకు ఈ విషయం అంతా తెలుసు.

జానకి విశాల నయనాల యొక్క ప్రాశస్త్యము తెలిసి కూడా, ఇల్లాగ, తన చేతులతో తాను ఆమె కళ్ళుమూయటం అనేది సరసహృదయుడు చేయవలసిన పనికాదు. కాని శర్మ ఇల్లాంటి పనులుచేసి శాస్త్రాన్ని తగలేస్తున్నాడు.

అయితే,

శర్మ స్వర్గసౌఖ్యాన్ని అభిలషించి ఆమె కళ్ళు మూశాడూ అంటారు కొందరు! అది ఒప్పుకోవలసిన విషయం కాదు. ఎందుకంటే, స్వర్గానికి కళ్ళే కావలసివచ్చినవా? క్షీరసాగరం లోని బుద్బుదములలాగ ప్రకాశిస్తూ ఉన్న ఆమె వక్షమూ, స్నిగ్ధములైన ఆమెకపోలపాళి అరుణరాగ యుక్తమైన ఆమె అధరమూ ముదమైన సౌందర్య సీమలు ఎన్ని లేవు!

ఆమెతనువు బంగారపు పొలము. ఎక్కడ ముట్టుకొన్నా బంగారమేకదా! అల్లాంటప్పుడు శర్మ ఆ నయన ద్వయాన్నే. తాకటం ఏమిటా అని నా ప్రశ్న!

ఎందుకైనా కానీయండి శర్మమాటుకు ఆ పిల్లకళ్లు గట్టిగా మూసిన మాటనిజం ఇంక ఏమనుకుంటే ఏమిలాభం!

శర్మ చేసిన పని మంచిదని పెద్దలూ, తెలిసినవాళ్ళూ ఎవరూ అనరుగదా! గులాబీ రేకులవలె ఉన్న ఆమె కనురెప్పలనూ, వానిక్రింద విచ్చిన బొడ్డుమల్లెపూలలాగున్న ఆమెకన్నులనూ, వాని సమీపభూమిలో అటూ ఇటూ ఉన్న మృదువైన నయనసీమనూ ఇల్లాగ తన చేతులతో నొక్కటం అనేది కేవలం దారుణమైన పనిమటుకు అవును. ఇది శాస్త్రసమ్మతము కాదనీ, ఆనుపూర్విక విద్వత్సాంప్రదాయికముకూడా కాదనీ, నేను గట్టిగా చెప్పగలను. వాత్స్యాయనుడు కూడా ఇల్లాగ చేయటం కామ క్రీడ అని ఎక్కడా చెప్పినట్లు లేదు.

ఇల్లాగ కళ్ళుమూసి నొక్కటంవల్ల పాపం జానకి ఎంత హడలిపోయిందో తెలుసుకొన్న వాళ్ళుకూడా లేకపోవటం చాలా విచారకరమైన విషయము కదా!

శర్మ సరసహృదయుడైతే ఆ పిల్ల "అబ్బ! ఏమిటండీ, అది!" అని అన్నప్పుడైనా కాస్త జాలిని పొంది ఉండాలిసింది. శర్మ ఏమాత్రమూ జాలిచూపలేదు. పైగా అంటాడూ

దయితా దయితానసాంబుజం
దరమీలన్నయనా నిరీక్షతే.

అని!

ఆ అమ్మాయి మీలనము పొందుతూఉన్న నయనాలు కలదై ప్రియుని ముఖాంబుజమును చూస్తూ ఉన్నదట! అందు కనే తాను ఆమె కళ్లు మూశాడుట!

ఆ నిమీలిత నేత్రాలు ఆమెగారి చుంబనేచ్ఛను అభివ్యక్తం చేస్తున్నాయట! ఆ పని జరగకుండా ఉండటానికి అతను కళ్ళు మూశాడట!

అల్లాగ కళ్ళుమూయటం తప్పు అని శర్మ అంగీకరించడు. పెద్దపెద్ద మాటలు ఉపయోగించి శ్లోకాలుచదివి తాను మర్యాదతప్పి ప్రసక్తించటము లేదూ అని వాదిస్తాడు.

ఆమె సిగ్గుతో తల వంచుకొన్నదట! ఆ దరమిలా స్వయంసౌఖ్యంతో తన ముఖాంబుజమును ముద్దుపెట్టుకోవలెననే కాంక్ష వ్యక్తము అయిందట! కొంచెము కొంచెము కనుమూతలలో ఆమె తనను ఉత్కంఠతతో చూస్తున్న దీఅంటాడు.

ఆ పిల్ల మాటలను అల్లాంటి విపరీతమైన అర్థాలు కల్పించటమే అతను పిచ్చివాడై పోయినాడు అని అంటానికి ప్రబల నిదర్శనము.

శర్మను ఇంకా కదిలిస్తే ఆ పిల్ల నయనాలలోని దరనిమీలనము త్రపాకార్యమనీ, స్థాయీ భావమనీ ఇంకా ఏవేవో విభావ అనుభావ సంచారీ భావాలనీ అంటాడు. మనకు కూడా పిచ్చిఎక్కుతుంది. అందుకని ఆ విషయం వదిలేస్తున్నాను.

వదిలేసి ఆ పిల్ల కళ్ళను శర్మ అల్లాగ మూసిన తరువాత ఏమిజరిగిందీ అన్న విషయానికి వస్తాను.

శర్మ ఇల్లాగ తన కళ్ళను మూయటం జానకికి ఏమా త్రమూ ఇష్టంలేదు. అల్లాంటప్పుడు ఆపిల్ల శర్మను గట్టిగాకోప్పడి ఉండవలసింది. ఏకారణంచేతనో ఏమో ఆ పిల్ల మొగుణ్ణి కోప్పడి ఉండలేదు. అసలు కోప్పడాలని తెలియదు, సంస్కృతం చదువుకొన్నదా ఏమన్నానా? పిల్లలకు సంస్కృతం చెప్పించాలని పెద్దవాళ్ళు గోలపెట్టటానికి కూడా ఇదే కారణం, కాస్త మంచీ చెడ్డ తెలుస్తుందనేగా!

ఆ పిల్ల మొగుణ్ణి కోప్పడక ఊరుకోవటం పెద్ద పొరపాటు అయింది.

ఊరుకోనే టప్పటికి ఆమె కళ్ళపై నున్న శర్మ రెండు చేతులుకూడా హఠాత్తుగా జారి ఆమె వక్షస్థలంపై పడిపోయినవి.

పిల్లలు ఇద్దరూకూడా హడలిపోయినారు. జానకి శరీరం అంతా పులకలు తేలింది. శర్మ శరీరం గాలిలో తేలిపోయింది.

జానకి ఇల్లాంటి సంఘటన ఎప్పుడూ ఊహించలేదు. ఆమె ముగ్ధకావటం చేతా ప్రౌఢచేసే శృంగార చేష్టలతో పరిచయం లేకపోవటముచేతా నిర్ఘాంతపోయి ఊరుకొన్న దేకాని ఏవిధమైన విలాసక్రీడా జరుపలేదు.

శర్మకూ తెలియదు ఇల్లాంటి విషమపరిస్థితి వస్తుందని! కళ్ళుమూసె ప్రకరణం ఇల్లాగ తేలుతుందని అతనూ ఎక్కడా చదివి యుండలేదు. కళ్లుమూద్దామనే ఆలోచించాడు గాని

తన చేతులు స్థానచ్యుతినిపొంది ఇల్లాగ నిమ్నోన్నత సీమలపై సంచారం చేస్తవి అని అతడూ అనుకోలేదు.

ఆ ముగ్ధబాలిక, నవ వధూ జాతికి సహజంగా కలిగే తన్మయత్వంలో ఉండి పోయింది. అల్లా ఉండి పోవటంలోనే ప్రకరణం తప్పిపోయింది.

అయితే శాస్త్రరీత్యా ఏమిజరగవలసింది! అల్లాంటి అవస్థలో పడ్డ ఒక నాయిక ఏంజేసిందీ...?

హృదయగతం ప్రియపాణిం మందమాక్షిపతి అనిగదా! అంటే, హృదయగతం అనగా వక్షోభాగాన ఉన్న ప్రియుని హస్తాన్ని మెల్లిగా తీసివేస్తున్నదట! శాస్త్రరీత్యా జరగవలసిన పని అది! అల్లాగ జరిగినట్లయితే ప్రకరణం క్రమము తప్పేది కాదు.

కాని జానకి తన్మయత్వంలో ఉండిపోయి అతని కర పల్లవాలను మెల్లిగా తోసివేయటం మరచిపోయింది. మరిచి పోయి ఆ లజ్జాపిహిత తన్వి, ప్రసన్నవదనంతో చిరునగవుల ముత్యాలు వలకబోస్తూ అమాయికంగా చూస్తూ ఉండి పోయింది.

ఉండి పోయేటప్పటికి శ్లోకంలో చెప్పినట్లు జరగక క్రమం తప్పిందా లేదా అదీ నాగోల!!

ఇంకా ఎందుకుచర్చ! క్రమం తప్పినమాట మాత్రము నిజం! దీనికెవరు బాధ్యులు అంటే, శర్మే!

ఎందుకంటే,

ఆ పిల్లకు ఏమీ తెలియదు. సంస్కృతం చదువుకో లేదు. మరి శర్మే ఆ విషయం అంతా చూచుకొని తాను చేస్తూ ఉన్నపని, జరుగుతూఉన్న వృత్తాంతము సరీగ్గా ఉన్నదా లేదా అని చూచుకోవలసినది. అతడు అల్లాగ చేయకపోవటంచేత ఈ శృంగారకాండ అంతా క్రమంతప్పి అశాస్త్రీయ కామకలాపం అయింది !

సామాన్యులైన భార్యా భర్తలు ఇల్లాగ ప్రవర్తించారూ అంటే అంతగా అనుకోవలసింది ఏమీలేదు. కాని పండితుడైన శర్మ ఇల్లాగ అశాస్త్రీయంగా ప్రవర్తించటం మహాదోషయుక్త మైనవిషయము అంటాను. అట్టిప్రవర్తనను నేను ఏమాత్రమూ ఒప్పుకోను.

నువ్వు ఒప్పుకోనేది ఏమిటి, అల్లాంటి ప్రవర్తనను అనుభవించే జానకే ఒప్పుకొన్నప్పుడూ అని ఎవరైనా అన వచ్చు ! జానకి ఏమీ తెలియని అజ్ఞానురాలు. అందుచేత అతని ప్రవర్తనను హర్షించవచ్చు, నేను మాత్రము శర్మ అధర్మ ప్రవర్తనను ఖండిస్తున్నాను.

శర్మవంటి మహాపండితుడే శాస్త్ర మర్యాదలను ఆచ రించలేక తలక్రిందులై పోయినాడు కాబట్టి, సామాన్యులు ఇల్లాంటి సందర్భాలలో క్రమం తప్పకుండా ఉండాలంటే ప్రక రణం అంతా ముందుగా వ్రాసిపెట్టుకొని ఉంచుకోటం మంచిదీ అని కూడా నేను చెపుతున్నాను.

# శర్మ జానకిని ముద్దుపెట్టుకొన్న ఘట్టం

శర్మ పండితుడనీ, సంస్కృతం కూడా చదువుకొన్నాడనీ చెప్పాను!

జానకి సంగతికూడా చెప్పాను!

ఆ అమ్మాయి దర్శనీయమైన రూపమునూ ప్రియమైన వాక్కునూ కలిగియున్నది.

అయితే నేం!

వ్రీడావతి

కొంచెం పెంకిపిల్ల!

ఆమె సాయంత్రం అయ్యేసరికి చక్కగా అలంకరించుకుంటుంది. తల దువ్వుకొని పూలు పెట్టుకుంటుంది. స్నిగ్ధమై నిడుపై కోడిత్రాచులాగ నిగనిగలాడుతూ ఉన్న ఆమె జడ పిరుదులపైన విలాసంగా ఊగుతూ నడచినప్పుడు కొద్దిగా లేస్తూ పడుతూ మహా రమణీయంగానూ దర్శనీయంగానూ ఉంటుంది.

అయితే ఏం లాభం?

ఆ జడను ఏ విధంగా కాముక క్రీడావస్తువుగా ఉపయోగించాలో ఆ పిల్లకు తెలియదు. ఊరికే వ్రేలాడుతూ ఉండగానే సరా! శర్మకు తాకేలాగున జడను విసరాలె.

ఆజడను శర్మ కంఠసీమను పెనవెయ్యాలె. ఏదో అల్లాంటి తమాషాలు చెయ్యాలె.

ఇల్లాంటివి ఏవీ చేయకపోవటం వల్లనే శర్మ చాలా ఖిన్నుడై పోతున్నాడు.

శృంగార చేష్టలు ఆ పిల్లకు బొత్తిగా తెలియక పోవటం శోచనీయమైన విషయమే.

శర్మ అయినా ముందంజవేసి ఆ అమ్మాయిని లాలన చేసి తనకు వశంవదురాలనుగా చేసికొనే శక్తి సామర్థ్యాలు లేనివాడు.

ఒక్కరోజున శర్మ ఆ అమ్మాయిని పట్టపగలే ముద్దు పెట్టుకోవలెనని నిశ్చయించు కొన్నాడు.

శర్మ తొందరపడి ఈ నిశ్చయానికి వచ్చినాడు అన టానికి వీలు లేదు. అతడు ఈ విషయమై పాపం చాలాసేపు ఆలోచించాడు. కామసూత్రాలు మొదలైన గ్రంథాలు ఎన్నో తిరగేసి, చివరకు అది అసంస్కృత వ్యాపారము కాదనీ, శాస్త్ర సమ్మతమైనదేననీ, కాముక వ్యాపారమే అయినా ఆనుపూర్వీక విద్వత్సాంప్రదాయమేననీ, శాస్త్రమర్యాద కలదేననీ నిశ్చయించాడు.

ఆ తరువాత ముద్దుపెట్టుకొనే విధానాలను గురించి తనకు దొరికిన సంస్కృత గ్రంథాలను తిరగేసి రెండు రకాల

ముద్దులు తనకు నచ్చినవి ఏవి వాటిని గురించిన ప్రకరణం అంతా వ్రాసుకొని జాగ్రత్త చేసుకొన్నాడు.

ఆ రోజున ప్రొద్దుటనుంచీ కూడా అతడు ఆ ప్రయత్నంలోనే ఉన్నాడు. పెందలాడే స్నానంచేశాడు. ముఖానికి స్నో పూసుకొన్నాడు. తెల్లని ధోవతి కట్టుకొని పైన సన్నని గ్లాస్కోమల్లు చొక్కా తొడుక్కున్నాడు.

జానకికూడా మామూలుగా సుస్నాతయై గులాబీ రంగు చీరగట్టి తెల్లని గ్లాస్కోమల్లు రవిక తొడిగింది. ఆమె రవిక చేతుల అంచులు జరీపేటుతో కుట్టబడి ఉన్నవి. ఆమె మెడలో నాల్గు నవరసుల గొలుసు ఒకటి తళతళా మెరసి పోతున్నది. మిగతా అలంకారాల విషయము మనకు అనవసరము. ఆమె ఆకర్షణీయంగా ఉందీ అని చెప్పటానికి ఇంత వరకు చాలు.

జానకి యొక్క కమనీయమైన ఆకృతిన్నీ మధురమైన స్వరమున్నూ అతనిని ఎక్కువగా ఆకర్షించినవి. ఆమె దేహంపైనున్న రమణీయ సీమలనుతాకి ముద్దాడాలని అతనికి ఊహ కలగటంలో వైపరీత్యం ఏమీ లేదనే అనవచ్చు కాని శాస్త్ర వెనకాముందూ చూడాలన్నారు పెద్దలు !

అందుకనే శర్మ ఆమెను వెనకాముంధూ కూడా చూశాడు. చూచి ఆమె శరీరంలో ఏభాగం ముద్దెట్టుకోవలెనో అన్నీ ఆలోచించాడు.

వెనుకవైపునుంచి కనపడుతూఉన్న ఆ బంగారైన పిమ్మట్టు లనుగాని, శంఖంలాగ మనోహరమైన వంపులుగలిగి తెల్లగా నవనవలాడుతూ ఉన్న ఆమె కంఠసీమనుగాని ముద్దెట్టు కొందామని శర్మ అనుకొన్నట్లయితే చాలా బాగుండేది; ఇంత గ్రంథం జరక్కపోను.

కాని శర్మ చేసిన తప్పేమిటీ అంటే స్నిగ్ధముగా తళ తళమెరుస్తూ తేలికగా పల్చగా ముట్టుకొంటే చిటికిపోతయ్యా అన్నట్లు నీటి బుడగలలాగ ఉన్నటువంటి ఆమె బుగ్గలను మాత్రమే ముద్దెట్టుకోవాలని అనుకొన్నాడు.

ఇక్కడే శర్మ పొరబడ్డాడు కూడాను !

స్త్రీని ఎటువైపునుంచి ముద్దాడాలన్న విషయంలో చాలా ప్రకరణాలు ఉన్నవి. ప్రాచీన అర్వాచీన పద్ధతులు భేదిస్తున్నవి. అయినా ఆవిషయమై అతడు అంతగా ఆలో చించకుండా ఉండవలసినది.

ఎందుకూ అంటే నిజమైన శృంగార మాధుర్యం తెలి సినవాడికి ప్రాక్ పశ్చిమాలు రెండూ ఒకటే! పూర్వార్ధ ఉత్త రార్ధ సీమలూ ఒకటే ! అన్ని సౌందర్య సీమలూకూడా చుంబ నీయములే !

వదనమూ, కనుబొమ్మలూ, అధరమూ, నేత్రములూ, నుదురూ మొదలైన రమణీయ ప్రదేశములున్నా, ప్రఫుల్ల [illegible] పేశలత్వము కలిగిన కపోల నిమ్న భాగములూ

చుంబన చర్చకు చాలా అనుకూలము లే. అయినప్పటికిన్నీ, వెనుకభాగం కూడా స్పర్శనీయంగానూ, శిరీషకుసుమ పేశలం గాను ఉన్నటువంటి సమయంలో దానితోనే సరిపెట్టుకొని ఆనందాన్ని పొందాలిగాని, తనకు లభ్యం కానటువంటి ఆ కపోలపాళినే ముద్దెట్టుకోవాలని పట్టుబట్టటం తెలివితక్కువ తనమూ అని అనక తప్పదు.

అదీ కాక,

ఆ అమ్మాయి ముగ్ధగాని ప్రౌఢ కాదుగదా ! ఆ సంగతి శర్మ తెలుసుకోవలసింది. పండితుడుకదా, ఆ మాత్రం తెలుసుకోలేక పోయినాడేమో అని విచారం కలుగుతున్నది.

నిన్ను ముద్దెట్టుకుంటాను అని భర్త తనకోరికను తెలియ జేయటంతోనే బుగ్గలు అందించి రెండుచేతులనూ అతని కంఠానికి పెనవేసి ప్రియుని సంతోషపెట్టాలనే విషయం ఆ అమ్మాయికి తెలియదు.

అల్లాంటప్పుడు శర్మ అయినా ఆ పిల్లకు ఎదురుగా వెళ్ళి ఆమె ముఖాన్ని గట్టిగా రెండు చేతులతో నొక్కిపట్టుకొని దగ్గరకు లాక్కొని తాక్కొన రెండుముద్దులు పెట్టుకొని వదిలేసి తన పనిమీద తాను వెళ్ళిపోవలసింది.

శర్మ అల్లాగ చెయ్యలేదు. చెయ్యమని చెప్పినా చెయ్యడు. అది అసంస్కృత వ్యాపారమనీ, అనార్య సాంప్ర దాయమనీ, రాక్షసకృత్యమనీ అతని ఉద్దేశం.

బలవంతం లేకుండా మామూలుగానే ఆ అమ్మాయిని ముద్దెట్టుకోనేందుకు శర్మ నిశ్చయించాడు.

ఒక పురుషుడు ఒక స్త్రీని ముద్దెట్టుకోవాలె అంటే ముందు వారిద్దరూ ఒకరి కొకరు మిక్కిలి సమీపంలో ఉండటం సంభవించాలె.

ఇందులో మొదటిదే శర్మకు లభ్యంకాలేదు. ఒకవేళ జానకి సామీప్యం లభ్యం అయినా శర్మ ముద్దెట్టుకుంటూ ఉంటే ఆ పిల్ల ఊరుకోటం అనేది కలలోవార్త. ఈ విషయం శర్మకు తెలియకపోలేదు. అయినా ఆ కుఱ్ఱవాడు ఆ ప్రయత్నాలు మానలేదు.

"జానకీ! కొంచెం పాపటతీసి తలదువ్వుతావూ?" అని అడిగాడు శర్మ. తనకు పాపట తీస్తున్నప్పుడు ఆమె ముఖం తన ముఖానికి చేరువగా వస్తుందనీ, అప్పుడు చటుక్కున ముద్దెట్టుకోవచ్చుననీ శర్మ ఊహించాడు. ఈ ఊహకొంచెం తెలివిగానే ఉంది.

జానకి కూడా సరేనని వచ్చింది శర్మ తల దువ్వటానికి. ఆమె వచ్చి అతని వెంట్రుకలకు నూనెరాచింది. ఆ సమయం శర్మకు ఏమీ అనుకూలించలేదు. అయినా శర్మ ధైర్యాన్ని కోల్పోలేదు.

ఇక పాపట తీసే సమయంలో ఆమె ముఖం తనకు అతి సమీపం అవుతుంది, అప్పుడు ఆమె బుగ్గలను ముద్దాడాలి అని నిశ్చయించుకొన్నాడు శర్మ.

ఈ ఊహ అతని తనువుపై పులకలు కలుగజేసింది కూడా. చాలా ఆతృతగా ఆ సమయానికై నిరీక్షించాడు. కాని అప్పిల్ల ఏమిచేసింది అంటే కుడిచేత్తో దువ్వెన పట్టుకొన్నది. ఎడమచేత్తో ఆ అమ్మాయి, శర్మ చిరుగడ్డాన్ని, గట్టిగా నొక్కిపట్టుకొని మరీ తలదువ్వింది. ఇల్లాగ నొక్కిపట్టటంచేత శర్మ తలను ముందుకుగాని వెనక్కుగాని పక్కలకు గాని తిప్పటానికి వీలులేక పోయింది. చూస్తూ ఉండగానే ఆ అమ్మాయి అతనికి తలదువ్వి బొట్టుకూడా పెట్టి వెళ్ళిపోయింది. శర్మ ఆమె ముఖసౌందర్యాన్ని ముఖ్యంగా మామిడిచిగురులా ఉన్న ఆ పెదవులనూ ఉజ్వలములైన ఆమె కపోలాలనుచూస్తూ ఉండిపోయినాడే కాని ఆమెను దగ్గరకు తీసికొని ముద్దుపెట్టుకో లేకపోయినాడు.

శర్మ నిజానికి మహామంచి అవకాశాన్ని పోగొట్టుకొన్నాడు. కాని అతన్ని ప్రత్యేకంగా నిందించీ ప్రయోజనం లేదు. మోహాపరవశులైన వారి ప్రవర్తన ఎప్పుడూ అలాగే ఉంటుంది అనిగదా శాస్త్రము. ఒకసఖి విరహంలోపడి ప్రియా, ప్రియా అని విలపిస్తూ తన సన్నిధికి వచ్చిన ప్రియుణ్ణి పరిచయములేని దానివలె చూస్తున్నదట! "విరహేణ వికల

హృదయా, విలపంతీదయిత ! దయితేతి ఆగతవసి తం సవిధే, పరిచయహీనేవ వీక్షతే బాలా – అనిగదా అన్నాడు.

సరే, ఆ సదవకాశం అల్లాగ పోయింది. ఆ తరువాత మళ్ళీ ఇంకొక అదనుకోసం శర్మ ఆమె వెంటవెంట తిరిగాడు పిల్లిలాగా ! ఏం కావాలండీ అని అడిగింది జానకి. శర్మ చెప్ప కూడదూ, ఇల్లాగ నిన్ను ముద్దుపెట్టుకోవాలెనని కోరిక కలిగింది, ప్రసన్నురాలవు కావలసింది అని ! అల్లా అడిగితే ఎల్లాగ ఉండేదో ! శర్మకు గుండెనిబ్బరం లేదు. భయపడి పోయినాడు. ఆ పిల్లమటుకు ఏమంటుందేమిటి ? ఏమన్నా అంటే శర్మ ఇల్లాగ చేయటం శాస్త్రసమ్మతమేనని శ్లోకాలు చదవలేడు కనకనా ! ఇంతకూ ఆమాట అనలేక పోయినాడు. పైగా ఏం కావాలని అడిగితే ఏమీ అక్కరలేదు, ఊరికేనే వచ్చాను అని అబద్ధం కూడా ఆడాడు. అబద్ధాలు ఆడవలసిన అవస్థ ఏమొచ్చింది నిజానికి, అతని కర్మం కాకపోతే !

శర్మ తన గదిలోకి వెళ్ళిపోయినాడు. సంస్కృత పుస్తకాలు కొన్ని తిరగేశాడు. కాని తనను బాధిస్తూ ఉన్న సమస్యకు సమాధానం ఆ పుస్తకాలలో ఎక్కడా అతనికి దొరకలేదు. శర్మ పాపం దిగులుపడి పోయినాడు.

౨

ఇక జానకిసంగతి ఎట్లాగుందీ అంటే ఆ అమ్మాయి ఇతని వంక చూడటమే మానేసింది. ఇప్పుడు ఏంజేయాలె !

శర్మ ఆలోచించి ఆలోచించి చివరకు ఒకపని చేశాడు. తన చొక్కాకు ఉన్న గుండీలు తీసి కిటికీలోనుంచి విసిరి అవతలకు పారేశాడు. పారవేసి ఏదో ఘనకార్యం చేసినవాడిలాగ చిరునవ్వు నవ్వుకొని వెంటనే కేకవేశాడు, "జానకీ చొక్కాకు గుండీలు లేకుండా ఎంతసేపు ఉండేది! వచ్చి ఇచ్చిపో!

ఆమె వచ్చి బీరువా తీసింది. అప్పుడు ఆమె వీపును గాని చేతులనుగాని కంఠ సీమనుగాని చటుక్కున ముద్దెట్టుకొన్నట్లయితే తీరిపోయేది. ఆ పిల్ల అటు బీరువావైపు తిరిగి ఉన్నది కాబట్టి శర్మ ప్రయత్నాలు గమనించేది కూడాకాదు. కాని శర్మ అల్లాగ చెయ్యలేదు.

శర్మ అల్లాగ చేయకపోవటం ఎంచేతనూ అంటే అతనికి తోచకకాదు! తోచకేం! అనేకసార్లు వచ్చింది ఆ ఆలోచన. కాని అతడు ఆమె బుగ్గలనే ముద్దాడాలని పట్టుబట్టి భీష్మించుకు కూర్చున్నాడు ఆయెను!

అబ్బో! శర్మ ఊరికే కూర్చోలేదు. చాలా చాలా విషయాలు ఆలోచిస్తున్నాడు. ఆ అమ్మాయి తన బీరువాలో నుంచి గుండీలుతీసి తన చొక్కాకు అమురుస్తూ ఉన్నపుడు తాను అనుకొన్న శృంగారలీల జరపాలని అతని ఊహ!

అయితే ఆ పిల్ల శర్మ దగ్గరకన్నా రాలేదు. బీరువాలో నుంచి గుండీలుతీసి దూరాననుంచునే 'ఇవిగో తీసుకోండి' అని అతని ప్రక్కపై పడేసి ముసిముసినవ్వులు నవ్వుకొంటూ వెళ్ళిపోయింది.

ప్రతి విషయంలోనూ శర్మ ఇల్లాగ పరాజితుడు అవుతూ ఉన్నాడు. శర్మ మళ్ళీ ఆలోచించాడు. ఎట్లాగయినా సంస్కృతం చదువుకొన్న బిడ్డకాబట్టి, ఇంకో ఉపాయం తోచింది. ఏదో కారణం కల్పించి, ఆ పిల్లను తన గదిలోకి రప్పించి ఏదో మాయచేసి తనకోరిక నెరవేర్చుకోవాలె. శర్మ ఏమీ తొందరపడ లేదు. ఆ అమ్మాయి వచ్చిన తరువాత తను ఏవిధంగా నవ్వుతూ సమీపించవలసినదీ, ఏవిధంగా ఆ పిల్లను మంచిచేసుకోవలసిందీ అంతా ఆలోచించి ప్రకరణం అంతా నిబంధించుకొన్నాడు.

ప్రకరణం ప్రకారం ముందు తాను దీక్షగా చదువుకొంటున్నట్లు నటనచేయాలె. అందుకని పుస్తకంతీసి ముందు పెట్టుకొన్నాడు. ఏదో ఒకశ్లోకం పెద్దగా చదివాడు. ఎందుకూ అంత పెద్దగా చదవటం ! తనలోతాను చదువుకొంటే పోదు ! తెలియనివాళ్ళము మనము అల్లానే అనుకొంటాము కాని ఆ బుద్ధిమంతుని ఆలోచన వేరు. తనకు చదువుయందు ఉన్న దీక్షా అవీ జానకి గ్రహించాలని. గ్రహిస్తేగాని తాను నిర్ణయించుకొన్న ప్రకరణం నడవదు.

శర్మ శ్లోకాలు పెద్దగా చదవడం జానకి విన్నది. విని ఆ అమ్మాయి ముసిముసినవ్వులు నవ్వుకొన్నది. ఏమి గ్రహించిందో ఏమో మరి !

శర్మా! ఒక్కమాట చెబుతాను. ఎందుకోయ్ నీ చదువంతా ? ఆ శృంగార శాకుంతలము అవతలపెట్టు ! కాళిదాసు

ఎంత మహాకవి అయినా, ఎంత శృంగారం ఒలకపోసినా ఆ నిముషంలో జానకి గులాబీ పెదవులపై దాగుడుమూత లాడుతూ ఉన్న చిరునగవుయొక్క సౌందర్య రామణీయకము లను మించిన రమ్యసృష్టి చేయలేదు. గార్హస్థ్య పరమార్థ మయిన శృంగార విలాస సంపదను అంతా ఆ చిరునవ్వు ఒలక పోస్తున్నది. నీ జీవితం అంతా ఆ మధుర మనోహర మందహాస మునకు కారికలు వ్రాయటంలో గడుపుకోవయ్యా శర్మా.

సరే, అప్పుడేమయిందో చెప్పవలె!

శర్మ ఏవో రెండుమూడు శ్లోకాలు చదివి, చటుక్కున ఆగి వంట ఇంటివైపు ముఖంత్రిప్పి "ఓయ్ జానకీ, ఇటురా ఒక సారి" అని కేకవేశాడు.

'ఎందుకండీ మాటిమాటికి పిలుస్తారు ఎందుకో చెప్ప రాదూ?' అని అడిగింది జానకి.

ఎందుకేమిటి తెలియటంలేదూ? ఇక్కడికి వచ్చిచూడు.

ఏమిటండీ?

ఈ పిచ్చికలు కిచకిచలాడుతూ ఒకటేగోల! నన్ను చదువుకోనియ్యటంలేదు. ఒకసారి వచ్చి వాటిని బయటికి పంపిద్దూ!

జానకి వంటఇంట్లోనే వుండి "ఈ పిచ్చికలకు వేళాపాళా తెలియదు. ఇప్పుడేం కిచకిచలు కాకపోయినా! పోండి, పోండి ఇష్, ఇష్" అన్నది అక్కడనుంచే!

శర్మ ఉన్న గదిలోకి రానూ లేదూ ముఖం చూపించనూ లేదు.

శర్మ మరొకసారి ఖిన్నుడై పోయాడు. అతడు వేసు కొన్న పథకం అంతా పాడైపోయింది. అతనికి దుఃఖం కూడా వస్తున్నది.

ఓయి పిచ్చి శర్మా, ఇంత ప్రయాస పడనక్కర లేదోయీ, పోయి ముద్దెట్టుకో. ఆ పిల్ల ఏమీ అనదు అని అత నికి చెప్పేవారుకూడా ఎవరూ లేకపోయినారు గదా, పాపం!

## 3

ఆరోజున మామూలుగా భోజనాలు అయిపోయినవి.

శర్మ సరిగ్గా కడుపునిండా తిన్నాడని నేను అనను. అతడు ఆమె ముఖంవంక చూస్తూ "అయ్యో! లోకోత్తర సౌందర్యమును కలిగిన ఆమె ముఖమును దగ్గరకు తీసికొని నీటిబుడగలవలె తళతళ మెరుస్తూ ఉన్న ఆ బుగ్గలను ఒక్క సారి అయినా ముద్దుపెట్టుకో లేకపోతినిగదా అన్న విచారంతో అతడు అన్నము సరిగా తినలేదనే అనాలె.

శర్మ చాలా నిస్పృహచెంది సాయంత్రం దాకా చూస్తూ ఊరుకొన్నాడు. ఆ అమ్మాయి సాయంత్రం తన జడ విప్పి నిలువుటద్దము ముందు నుంచుని తల దువ్వుకొంటున్నది. అప్పుడు మాత్రం ఇల్లాగ అనుకొన్నాడు.

"స్వతంత్రము ఆకాశములో విహరించే మేఘముల చాటున ఉన్నటువంటి విద్యుత్కాంతులు ఈమె కనీనికలలో ఉన్నవికదా ! ఆహా ! ఈమె కపోలపాళి ఎంత మనోహరంగా ఉన్నది! ఇది మంచి సమయము. ఈ సమయము జారవిడువ కూడదు సుమా !

ఇంకొక విషయం కూడా అతనికి ఎక్కువ ధైర్యాన్ని ఇచ్చినది. ఏమిటీ అంటే ఆసమయాన జానకి అద్దంవైపుకు తిరిగి ఉన్నది. తాను వెనుకనుంచి ఆమెకు తెలియకుండా సమీపించ వచ్చును కూడా. ఇల్లాగ అనుకొని అతడు చాలా సంతృప్తినీ హర్షమునూ పొందినాడు.

అయితే ఒక యిబ్బంది వచ్చింది.

శర్మ ఆమె కంట బడకుండా వెనుక భాగాన్నే సమీపించగలుగుతాడు గాని ముందు భాగాన్ని ఎల్లాగ సమీపించ గలుగుతాడు !

అయితే శర్మ ఈ విషయమై ఆలోచించలేదు. అడుగులో అడుగు వేసుకొంటూ నడచిపోతున్నాడు.

ఆ కుఱ్ఱవాడు అల్లాగ దొంగలాగ రావటం ఆ పిల్లకు అద్దంలో కనిపించింది. అతణ్ణి చాలా దగ్గరకు రానిచ్చి, ఆ పిల్ల గిరుక్కున తిరిగి 'ఏమిటిది, ఏమిటి, మీ అభిప్రాయం ? అని తీవ్రంగా అడిగింది.

శర్మ ఇదీసంగతి అని చెప్పేయకుండదూ! నోసంటేగా! ఏమీ మాట్లాడకుండా, ముసిముసినవ్వులు నవ్వుకొంటూ వెనక్కి-వెనక్కి వెళ్ళి పేముకుర్చీలో కూలబడ్డాడు.

శర్మా! శర్మా! నీ కర్మం అల్లాగ ఉంటే ఎవరేమి చెయ్యగలరు!

తాను ముద్దుపెట్టుకోదల్చిన కపోలములు ఆమె కళ్ళ ముందు లేకుండా మరొక ప్రదేశంలో ఉంటే ఎంతో బాగుం డేది కదా అనుకొంటూడు. శర్మ సృష్టిలోనే మార్పులు కోరు తున్నాడు. ఆ దెబ్బతో అతనికి సాయంత్రందాకా ఏమీ తోచకుండా పోయింది.

శర్మ ఖిన్నుడై పోయినాడు. రాత్రి భోజనాలు అయిపోయి నవి. పుచ్చపువ్వులాంటి వెన్నెల మహా మనోహరంగా ఉంది.

జానకి ఆరుబయట వెన్నెలలో రెండు నక్కలువేసి వాటిపైన తెల్లని దుప్పట్లు పరచింది. మల్లెపూవులాంటి తెల్లని చీర కట్టుకొని జరీపేటుగల తెల్లని రవికతొడుక్కొని తలలో మల్లెపూలు పెట్టుకొని ఒకశయ్యపై పడుకొని ఉంది.

ఆ మనోహరమైన ఆ ఆకృతినిజూచి అతడు అను కొన్నాడు. "ఆహా, ఈ వెన్నెలలో ఈమె రూపం ఎంతో మహారమణీయంగా ఉంది సుమా!"

కొంచెంసేపు శర్మ ఆమెను తదేకనిష్ఠతో శ్రద్ధతో చూశాడు.

అరుణ రాగయుక్తమైన ఆ లలిత మృదుల మధురాధర మునూ, వెన్నెలను తినేస్తున్న ఆమె కపోలాలనూ, తదితర సీమలనూ చూచి శర్మ గుటకలుమింగి తానుచేసిన ప్రతిజ్ఞను జ్ఞాపకం తెచ్చుకొని, కాలవిలంబనం ఏమాత్రమూ చెయ్య కూడదూ అనే నిశ్చయంతో, శర్మ ఆమె శయ్యను సమీపించి నాడు.

ఆమె కన్నులు మూసుకొని వున్నది. నిద్రా వశు రాలయ్యో లేక త్రపాపారవశ్యానో చెప్పలేము కదా !

ఆ నిమిషమునుండీ శర్మ చేసినవన్నీ పొరపాట్లే ! బాహ్యేంద్రియ వ్యాపారాన్నిబట్టి ఆమె సుషుప్త్యవస్థయందు ఉన్నట్లు భావించాడు. కాని నిజానికి ఆమె నిద్రపోవటమే లేదు. శర్మను ఒక కంటితో కనిపెడుతూనే ఉంది.

ఆ పిల్ల నిద్రపోతూ ఉన్నదా లేదా అన్న సందేహము శర్మకు కలిగినట్లే ఉంది, లేకపోతే అతడంత మెల్లగా నడవ వలసిన అగత్యం ఏమీ లేదుకదా !

అయితే మెల్లగా నడిస్తే తాను వస్తూ ఉన్నట్లు ఆ పిల్ల గ్రహించ లేదు అనుకోటం పొరపాటు. ఆపిల్ల ఈ కుఱ్ఱవాడు రావటం ఓరగంట కనిపెట్టి నవ్వును ఆపుకొంటున్నది. కాని ఆ నవ్వు ఆమె పెదవులలోనుంచి తొంగిచూస్తూ ఉన్నది. మందస్మిత వదనయైయున్న కారణాన ఆ వనిత తాను చేయ బోయే చుంబన సంస్కారానికి సుముఖ అయి ఉన్నది అను కోటం రెండవ పొరపాటు.

ఈ పొరపాట్లు అన్నీ ఎందుకు చేస్తున్నాడూ అంటే అతనికి పిచ్చి ఎక్కుతున్నదేమోనని నాకు అనుమానంగా ఉంది.

ఎందుకూ అంటే, మొదట్లో ఆమె బుగ్గలు మాత్రమే ముద్దెట్టుకోవలెనని అనుకొన్న శర్మ ఇప్పుడు ఆమె అధరోష్ఠమునూ నేత్రాలనూ కూడా ముద్దుపెట్టుకొందామనే కాక సౌందర్య సీమలను అన్నిటిని కూడా కరతల పరామర్శ చెయ్యాలని ఊహిస్తున్నాడు !

ప్రొద్దుటినుండీ ఎంత ప్రయత్నంచేసినా ఆమె బుగ్గలలో ఒక్కదాన్నైనా ముద్దుపెట్టుకోలేక పోయిన ఈ ధీరుడు అమాంతంగా ఆ క్షణంలో అవీ, ఇవీ ముద్దెట్టుకోవాలని కోరుకోటం తెలివితక్కువ తనంకాక మరేమిటి ! కామాసక్తుడికి సాధ్యమూ అసాధ్యము అనేజ్ఞానం ఉండదు కాబోలు !

శర్మ అల్లాగ అడుగులో అడుగు వేసుకొంటూ వెళ్ళుతూ ఉన్నప్పుడే అనుమానం కలిగింది. ఆ అమ్మాయి మేల్కొని ఉన్నదేమోనని. మేల్కొనే ఉన్నట్లయితే ఆ అమ్మాయి తనను ముద్దుపెట్టుకోనివ్వదు. కాని ఎట్లా ! ఆ అమ్మాయి బుగ్గలు మిలమిలా మెరసి పోతున్నవి ! ముద్దు పెట్టుకోక తప్పదు ! అయితే తాను తీరా వంగి ఆమె బుగ్గలను ముద్దాడబోయే సమయానికి ఆపిల్ల ఏంజేస్తుందో ! ముఖం కాస్తా తిప్పేసుకొంటుందేమో !

ఆలోచించి, ఆలోచించి చివరకు ఏమైనా కానీయమని శర్మ బెదురుబెదురుగ్గానే వెళ్ళి ఆమె ప్రక్కలో కూర్చున్నాడు.

ఆ పిల్ల యోగ్యురాలున్నూ, సుగుణవతిన్ని, లజ్జా వినమ్రమయూ, అయిన కారణాన శర్మ బ్రతికి పోయినాడు. జానకి ఏమీ అనలేదు.

శర్మకు ఎక్కడలేని ధైర్యమూ వచ్చింది. ఇక ముద్దు పెట్టుకోందామని అనుకొంటూ ఉండగా అతనికి ఒక ఆలోచన వచ్చింది.

అది ఏమిటీ అంటే, ఆ పిల్ల నిద్రపోతున్నట్లు నటిస్తున్నమాట నిజమేనా అని! నటన అయితే వచ్చిన ఇబ్బంది ఏమీలేదు కాని నిజంగా నిద్రపోతూ ఉంటేమాత్రం ఆ అమ్మాయిని ముద్దుపెట్టుకో కూడదు. అది శాస్త్రసమ్మతం కాదు.

అందుచేత శర్మ ఈ విషయమై తనలోతానే తర్కించుకొని ఆ పిల్ల నిద్రపోవటంలేదు అనే నిశ్చయానికే వచ్చాడు.

శర్మ తెలివితక్కువవాడే అయినా ఆ వధువు మధ్య మధ్య కొద్దిగా కళ్ళు తెరుస్తూ మూస్తూ ఉండటం కనిపెట్ట లేనంత తెలివి తక్కువవాడు మాత్రం కాదు.

అయితే ఇప్పుడు మరియొక సమస్య వచ్చింది. ఆ పిల్ల చూస్తూ ఉండగా ముద్దుపెట్టుకోవటం ఎల్లాగ! తన అభీష్టానికి

ప్రొద్దుగూకులూ విముఖత్వం చూపినపిల్ల, ఇప్పుడు సుముఖత్వం చూపుతుందని సమ్మకం ఏమిటి !

శర్మ మళ్ళీ ఆలోచించవలసి వచ్చింది. ఆలోచించి ఆ పిల్ల చూస్తూ ఉండగా తాను ముద్దుపెట్టుకొనే ప్రయత్నం చెయ్యకూడదనీ, ఆమె కళ్ళుపడకుండా ఈ చమత్కారం చెయ్యాలనీ శర్మ నిశ్చయం చేసుకొన్నాడు.

ఆ పిల్ల కళ్ళుపడకుండా ఈ మధురానుభవాన్ని పొందటం ఎల్లాగా అని శర్మ ఆలోచించి రెండుమూడు శ్లోకాలు జ్ఞాపకం తెచ్చుకొని అర్థాన్ని సమన్వయు పరచుకొని చివరకు ఒక పంథా తొక్కటానికి కృతనిశ్చయుడైనాడు.

అప్పుడు శర్మ ఏమిచేశాడూ అంటే కూర్చున్నవాడు కూర్చున్నట్లుగా ఉండి తన రెండు చేతులతోనూ ఆ ముగ్ధ బాలికయొక్క రెండు కళ్ళుకూడా గట్టిగామూసి వేగిరపాటుతో ఆ పులకిత తన్విని, ఆ సుందరాంగిని, ఆ ముగ్ధబాలికను, ఆ సమధిక లజ్జావతిని పదేపదే ముద్దుపెట్టుకొన్నాడు.

*　　　*　　　*　　　*

అయితే శర్మ రోజురోజంతా కూడా ముద్దుపెట్టుకొంటానికి ప్రయత్నం చేసినా ఏమాత్రమూ వీలుకల్పించని జానకి చివరకు ఇల్లాగ మెత్తపడి మాట్లాడకుండా ఎందుకు ఊరుకొన్నదీ అనేప్రశ్న రాకమానదు.

దానికి సమాధానం ఏమిటీ అంటే ఇల్లాగ వేగిర పాటుతో చుంబనార్చన చేస్తూఉన్న సంగతి ఆ పిల్లకు తెలియదనే నాకు సమ్మతం. ఎందుకూ అంటే ఆ పిల్లకు కళ్ళకు కన పడుతూ ఉన్న దానినే చూడలేనటువంటివన్నీ చెవులకు వినిపిస్తూ ఉన్న దానినే విన లేనటు వంటివన్నీ స్థితిలో ఉన్నది. అంతవరకు నేనూ గట్టిగా చెప్పగలను.

ఇల్లాగ ఉన్న కారణానో లేక నా కళ్ళతో నేనుచూడని విషయంలో నేను ఎందుకు జోక్యం కలుగజేసుకొన వలయునని అనుకొన్నదో ఏమో ఆ పిల్ల కొంచెంసేపు వరకూ కదలకుండా మెదలకుండా ఊరుకొనటం జరిగి ఉంటుంది.

కళ్ళు గట్టిగా మూయబడిన కారణాన ఆ చుంబన సంస్కృతి వనిత ఏమీ చూడ లేదు. చూడ లేదు కాబట్టి ఏమీ అన లేదు. ఆ పిల్ల మెదలకుండా ఊరుకొనటానికి ఇదే కారణం అయిఉంటుంది.

శర్మ అయినా తెలివిగల పనిచేశాడు. అల్లా చెయ్యాలని తోచినందులకు అతనిని అభినందించాలని ఉన్నది. సంస్కృతంలో ఉన్న శృంగార రసప్రధానమైన కావ్యాలు చదవంగానే సరా! ఇల్లాగ ఆ జ్ఞానం జీవితానికి వెలుగుఅయి ప్రసరించటమే చాలా గొప్ప విషయము.

అతడు గనుక ఆ పిల్ల కళ్ళు అల్లాగ మూయక పోయి నట్లయితే ఈ వ్యవహారం చాలాదాకా పోయేది!

ఇంతకూ శర్మ అదృష్టవంతుడూ అని అనవలసిందే !

శర్మ చాలా తృప్తిసి ఆనందాన్ని పొందిన వాడైనాడు. అతడు,

స్వేదాంబు సాంద్ర కణశాలి కపోలపాలి
డోలాయత శ్రవణ కుండల వందనీయా
ఆనంద మంకుర యతి స్మరణేన కాపి
రమ్యాదశా మనసి మే మదిరేక్షణాయాః

స్వేదోదక సాంద్ర కణములతో శోభిస్తూ ఉన్న కపోల పాలిపై, అటూ ఇటూ కదులుతూ ఉన్నటువంటి శ్రవణ కుండలములచేత శ్లాఘింప తగిన, చెప్పటానికి శక్యముగాని ఆ మదిరేక్షణయొక్క ఒకానొక మనోహరదశ మనస్సులో స్మరణ చేయగా ఆనందము అంకురిస్తూ ఉన్నది సుమా అని శ్లోకమూ తాత్పర్యమూ కూడా రాగవరుసతో చదువుతూ ఆ పర్యంకము పైన జానకి ప్రక్కనే ఏమీ తెలియని తన్మయస్థితిలో పడి నాడు శర్మ !

* * * *

సరే, జరగవలసిన పనిజరిగింది. శర్మ పట్టుబట్టి ఆమె కపోలాలనే ముద్దెట్టుకోగలిగినాడు. కాని అది జరుగవలసిన శాస్త్రీయ పద్ధతిలో జరుగ లేదు.

శర్మ ఈ చుంబన క్రీడను గురించి చాలా చదివినాడనీ కొన్ని ప్రకరణాలు వివరంగా వ్రాసిపెట్టుకొన్నాడని చెప్పినాను.

ఆమాట నిజమే. కాని సమయానికి ఆ ప్రకరణం జ్ఞాపకంరాని కారణాన్నో మరేకారణం చేతనో ఆ సంస్కారం జరుగవలసిన ప్రకరణంలో జరుగ లేదు.

ఈ విషయము నిరూపించటానికి ఒక్క విషయము చూపుతాను. జానకి ముగ్ధ. సమధిక లజ్జావతి. నాయిక ముగ్ధ అయినప్పుడు ప్రణయకోపం పట్టవలె ముందు. తదనంతరం చుంబన సంస్కారం జరగాలె. జానకి ప్రణయ కోపం పట్టక ముందే శర్మ ఆ అమ్మాయిని తొందరపడి ముద్దెట్టుకొన్నాడు.

ఆ పిల్లకూడా ఈ అశాస్త్రీయ పద్ధతికి కొంతవరకు బాధ్యురాలే. 'పాటలాధర మరందాస్వాద సమ్మగ్నముం డాళం జాలదు' అని పద్యంలో ఉన్నదికదా! కుంయ్ కై అనకుండా ఆ పిల్ల మాటుకు ఎందుకు ఊరుకోవాలె.

ఆ పిల్లకు ఏమీ తెలియదు. సంస్కృతం చదువుకో లేదు. కాబట్టి శర్మే ఈ లక్ష్యాన్ని మనస్సునందు ఉంచుకొని తదనుగుణ్యంగా ప్రవర్తించవలసింది. అదొక్కటే విచారింప తగిన విషయము.

ఈ జానకీ విలాసంలో ఇప్పుడు చెప్పబడిన వృత్తాంతం వల్ల మనము నేర్చుకోదగిన విషయము ఒకటి ఉన్నది.

అది ఏమిటీ అంటే, గృహిణి కపోలపాళినే ముద్దు పెట్టుకోవలెనని పట్టుబట్టి కూర్చోకూడదూ అనీ, ఆ పవిత్ర

మూ_ర్తి సుకుమార సుందరవిగ్రహానికి చెందిన సౌందర్య సీమలూ అన్నీ అనగా శిరస్సునుంచి శ్రీపాదంవరకూ ప్రతి భాగమూకూడా పవిత్రమూ మృదుమధురమూ ప్రేక్షణీయమూ వందనీయమూ అనిన్నీ, ముఖాంబుజము మొదలు పాదాంబుజ ములవరకూ పూజార్హ్మమనీ ప్రతియువకుడూ తెలిసికోవలసి ఉంది.

విశ్వశ్రేయః కావ్యం—అన్నారు. నేను ఈ మాట చెప్తున్నాను.

శర్మ జానకిని ముద్దుపెట్టుకొన్న ఘట్టము ఇంతటితో ఈ విధంగా సమా_స్తం అయింది.

# ప్రతిజ్ఞా పాలన

ఒకరోజున శర్మ జానకితో పోట్లాడి ఆమెముఖం చూడనని ఘోరప్రతిజ్ఞ చేశాడు.

ఛా, ఛా. చాలా తొందర పడ్డాడు.

ఏదో స్వల్ప విషయంలో జానకితో పోట్లాడి అంత ఘోర ప్రతిజ్ఞ చేయటంమాటుకు పండితుడైన శర్మ చేయవలసిన పనికాదు. చాలా శోచనీయమైన విషయము.

జానకి చేసినపని నిజానికి అంత గొప్ప తప్పిదమూ కాదు. ఇంత అల్లరి కాకుండా క్షమిస్తే పోయేది!

జానకి సంస్కృత పండితుని భార్య అయినా ఆ సాంప్రదాయాలూ రసవద్వినోద కార్యకలాపమూ ఆమెకు బొత్తిగా తెలియని కారణానే ఈ పోట్లాట వచ్చింది.

దర్శన మాత్రాన ప్రసన్నవదనంతో ప్రియవచనములతో భర్తకు స్వాగతము ఇయ్యాలనిగాని, అశ్రు స్వేదాదుల అనుభావాలతో తన హృదయంలో జనించిన హర్షాన్ని ప్రకటితము చెయ్యాలనిగాని, ఆ ముగ్ధబాలికకు తెలియకపోవటమే జానకీ శర్మల మధ్య జరిగిన కలహానికి కారణం.

శర్మ, 'దివసావసానకాలే, భవనద్వారి విలోచనే, దఘానా అవలోక్య సమాగతం తదామా మథరామా విక

సన్ముఖీ బభూవ' అనే శ్లోకాన్ని స్మరించుకొంటూ గృహో న్ముఖుడైనాడు.

అంటే, సాయంకాలమున గృహద్వారమున నేత్రము లను నిలిపినదై అప్పుడు వచ్చిన నన్నుజూచి ఆ రామ వికస న్ముఖి అయినది అని శ్లోకార్థము.

జానకి కూడా ఆవిధంగానే ద్వారంలో నిలబడి తన కొరకై నిరీక్షిస్తూ విప్పారిన బొడ్డుమల్లెవంటి కనుగవతో తనను చూడలేదని శర్మకు కోపం వచ్చింది.

వచ్చిన కర్మం ఏమిటీ అంటే ఇల్లాగ చూడాలని జానకికి తెలియదు. నేను సాయంత్రం వచ్చేసరికి నీవు ఇల్లాగ నిలబడి, ఇల్లాగచూస్తూ ఉండాలని శర్మ ఆమెతో చెప్పి ఉన్నతరువాత ఆమె వినక ఇల్లాగ ప్రవర్తించి ఉన్నట్లయితే అతని కోపానికి తగినంత కారణము ఉందని అనవచ్చు.

శర్మ అల్లాగ ఎప్పుడూ చెప్పలేదు. ఆమె అతనను కొన్నట్లు చేయనూలేదు. జానకి హేమ భూషణాదులచే అలం కృతయై, సాయం సమయాన ఇంటికి వచ్చిన భర్తను ఎదుర్కొని మన్మథ మిత్రములైన, చిరునగవుల సరసావలోకనములలో, మంజుల రచనలుగల వచనాలతో ఆయనకు సత్కారము చేయలేదు.

జానకి ఆసమయానికి కేశసంస్కారం చేసుకోవటం లోనో శయ్యా రచన చేయుటంలోనో, శయ్యా మందిరాన్ని

అలంకరించు పనిలోనో నిమగ్నురాలై ఉన్న దేమోకాని ప్రియాగమనాన్ని ఆకాంక్షించి హర్షపులకిత గాత్రియై ద్వారంలో నిలబడి ఉండలేదన్న మాట మాత్రం నిజం.

అయితే ఇల్లాగ చేయవలయునని శర్మ జానకికి చెప్పి యుండలేదు కదా! అందుకనే జానకి ఈ లాంఛనాలన్నీ జరుపలేదు. అల్లాంటప్పుడు శర్మకు ఎందుకు కోపం రావలెనూ అని నా ప్రశ్న.

కాని ఏమిలాభం?

నేనీ ప్రశ్న వేయకముందే శర్మకు కోపం వచ్చేసింది. శర్మ కోపంతో చాలా విసురుగా ఇంట్లోకి పోయి, బట్టలు మార్చి, సాయంస్నానాది కృత్యాలు నెరవేర్చుకొని భార్యతో ఒక్కమాట అయినా మాట్లాడకుండా భోజనంచేసి, మెసలకుండా వెళ్ళి గదిలో పరుపుపైన పడుకొన్నాడు.

పోనీ పడుకొన్నవాడు, ఆ చల్లగాలిలో హాయిగా నిద్రపోయినాడా, అదీ లేదు. నిద్రపోక జానకి ప్రవర్తనను గురించి తార్కిక బుద్ధితో విమర్శనను ప్రారంభించాడు. తాను వంచింప బడినట్లూ, జానకి తనను అవహేళన చేసినట్లూ నిర్ణ యించుకొన్నాడు.

శివ, శివ, జానకికి ఎంత అన్యాయం జరిగింది!

ఆ ముగ్ధ బాలికకు సంస్కృతం రాకపోవటం వలనా, సంస్కృతంలో ఉన్న శృంగార సాహిత్యంతో పరిచయము

లేకపోవటము వలనా ఆమెకు పరిఫుల్ల భావనా సౌభాగ్యమూ చతురతా వాల్లభ్యమూ అలవడలేదని శర్మకు తోచలేదు.

జానకి గర్వంతో ప్రవర్తించినదనీ, తనను తిరస్కరించినదనీ అనుకొన్నాడు. శృంగార కావ్యాలూ, రసగంగాధరమూ మొదలైన గ్రంథాలు చదివిన పండితుడు కాబట్టి, శర్మ చాలా ప్రమాణ బుద్ధితో ఇంతగా ఆలోచించాడు కాని, ఇంకొకడు అయితే పడుకొని నిద్రపోయేవాడు.

శర్మ కోపవశుడై ఉన్న కారణాన అతని బుద్ధి వక్ర మార్గాన గమించినది. జానకి విప్రలంభ శృంగార నాయికగా ప్రవర్తించకపోవటం అల్లాగుంచి ఆమెకు తనయందు అనురాగమే లేనట్లు నిశ్చయించుకొన్నాడు శర్మ.

అల్లాగ నిశ్చయించుకొని తన ప్రక్కమీదనే పడుకొని చీకటిలోకి చూస్తూ తనను ఇంతంగా వంచించినట్టిన్నీ తనకు అన్యాయం చేసినట్టిన్నీ జానకి ముఖం చూడనని ఘోర ప్రతిజ్ఞ చేశాడు.

౨

ఇల్లాంటి ప్రతిజ్ఞ ఏ గృహస్థూ చేసి ఉండలేదు. శర్మే ప్రథముడు. అందుకనే తాను ధీరోదాత్తుడు అయినాడని కూడా అతని నమ్మకం!

శర్మకు ఉచితానుచిత జ్ఞానం కూడా పోయింది. ఈ ప్రతిజ్ఞ సాధ్యమా, అసాధ్యమా అని కూడా ఆలోచించలేగు. జానకి ముఖం చూడనని నిశ్చయించు కొన్నాడు.

శర్మ చాలా పట్టుదలగల మనిషి. సంస్కృతంలో హరిశ్చంద్రో పాఖ్యానము చదివినవాడు. అన్నమాట చెల్లించు కోవటంలో శర్మ సత్య హరిశ్చంద్రుడికి ఏమీ తీసిపోడు.

అయితే ఈ ప్రతిజ్ఞాపాలనలో తనకు రాగల విఘాతములను గురించి శర్మ ఊహించుకొనక పోలేదు. అబ్బో! అతను ఎన్ని శృంగార కావ్యాలు చదివినాడు. అతనికి అన్నీ తెలుసు!

జానకి వచ్చి తన పైకి వంగుతుందనీ అప్పుడు ఆమె కబరీచ్యుత నవపారిజాత పరిమళములు తనకు మత్తును కలుగ జేయు వచ్చునని శర్మ తెలుసుకొన్నాడు.

చందనోదక సంసిక్తములైన ఆమె కుచయుగ్మ స్పర్శచే తనకు రాగల వివశత్వమును గురించి కూడా శర్మ ఊహించు కొన్నాడు.

ఇల్లాగ అన్ని విషయాలూ తెలుసుకొనే అతడు ఈ ప్రతిజ్ఞ పట్టాడు.

ఈ ప్రతిజ్ఞ వలన బాధ పడేది ఆ అమాయిక నవ వధువు జానకి. పాపం జానకికి ఎంత అన్యాయం జరిగిందిరా ఈశ్వరా అని నేను విచార పడుతున్నాను.

శర్మ చాలా పొరపాటు చేశాను. తొందరపాటుతో ముందు వెనుకలు ఆలోచించకుండా ఈ ఘోర ప్రతిజ్ఞ చేసినాడు ?

ఎందుకు ఈమాట అంటున్నానంటే శర్మ పడుకొన్నాడే, ఆపరుపుపైన మల్లెపువ్వులాంటి తెల్లని దుప్పటి పరిచి ఉంచిన దెవరు ?

తల దిక్కున రెండు మెత్తని దిండ్లు అమర్చిన దెవరు ?

బల్లపైన గాజుకుప్పెలో పూలగుత్తులు విలాసంగా పెట్టి ఉంచిన దెవరు ?

ఆ పిల్లకు ఈ కుఱ్ఱవాడి ఎడల విముఖత్వమే ఉంటే ఈ ఏర్పాట్లు అన్నీ ఎందుకు చేస్తుంది !

ఈ విషయము అతనికి తోచకపోనటం శోచనీయము. అతని ప్రవర్తనను ఏ పండితుడూ సమర్థించ లేడనే నా అభి ప్రాయం.

జానకిపైన కోపం వచ్చిందీ ! వస్తే ఏమి చేయాలిసింది. ఆమెను కోప్పడవలసింది. అయితే ఎందుకు కోప్పడలేదు. ఆసుకుమార సుశరీరను కఠినోక్తులచే బాధించటం అపండి తమనీ అసంస్కృతమనీ అనుకొని ఉండవచ్చు. అందుకనే కోప్పడలేదు. అల్లా అయితే ఈ ఘోర ప్రతిజ్ఞ మటుకు బాగుందా ?

## 3

సరే ప్రతిజ్ఞ చేశాడు.

చేసినవాడు ఆమెమాట తలచకుండా కళ్లుమూసుకొని నిద్రపోవాలె.

శర్మ అల్లాగ నిద్రపోలేదు. ఏవో శ్లోకాలు చదవటం మొదలుపెట్టాడు.

తన్మంజు మందహసితం శ్వసితాని తాని
సామే కలంక విధురా మధురాననశ్రీః
అద్యాపి మే హృదయ మున్మదయంతి హంత
సాయంతనాంబుజ సహోదర లోచనాయాః

అని చదివి శర్మ నిట్టూర్పు విడిచాడు.

సాయం సమయ పద్మములతో సమానమైన లోచనములు కలిగిన ప్రియురాలి యొక్క ఆ మనోహర మందహాసితము ఆశ్వసితములు, కళంక రహితమైన ఆ మధురాననము యొక్క శోభ, ఇప్పటికిని నా హృదయమును ఉన్మత్తము చేస్తూ ఉన్నవి సుమా అంటాడు.

ఇదంతా జానకిని గురించే నిజం మాటకువస్తే!
శర్మ కాదంటాడు!
ఈ శ్లోకము ఏదో పుస్తకములోనిది అంటాడు!
ఎవరో, ఎవరితోనో అన్నమాటలూ అంటాడు.

కాని ఇదంతా జానకికే అన్వయం అవుతుంతనీ, జానకిని ఉద్దేశించే తాను ఈ మాటలు మాట్లాడుతూ ఉన్నాడనీ ఎంత మందమతి అయినా ఊహించగలడు. కోపంవచ్చి ఆ పిల్ల ముఖం చూడనని ప్రతిన పట్టిన ఈ ధీరోదాత్త నాయకుడికి ఈ ఆలోచనలు ఎందుకూ అని నా ప్రశ్న ?

సామాన్యుడికీ, పండితుడికీ ఇదే భేదం ! సామాన్యుడికి భార్యమీద కోపంవస్తే రెండుతిట్టి ఆ పళంగా పడుకొని నిద్రపోతాడు. పండితుడైతే ఇల్లాగ సంస్కృత శ్లోకాలు చదువుకొని విచారపడతాడు.

ఎందుకయ్యానీకు ఈ గొడవఅంతా నిద్రపోక ! ఆవిడమీద కోపం వచ్చినప్పుడు ఆవిడ తనూ లావణ్యాన్ని గురించీ, ఆవిడ నయనశోభను గురించీ ప్రశంస ఎందుకూ అంటే, శర్మ తాను విచారాన్ని పొందటంలేదనీ, తన అనుభూతిని స్మృతి అంటారనీ హర్షాది చతుస్త్రింశత్ భావాలలో స్మృతికూడా ఒకటనీ చెబుతాడు.

ఏమిచెప్పినా, ఇల్లాంటి వ్యభిచారీ భావాలతో తన కేమి సంబంధం పండితుడై ఉండికూడా ! ఎబ్బే ! శర్మ సంగతి ఏమీ బాగుండలేదు.

## ౪

ఇల్లాగ శర్మ తన ప్రియురాలియొక్క తనూ లావణ్యాన్ని గురించీ, స్తనభార వినమ్రత్వాన్ని గురించీ, చాలా

సేపు ఆలోచించి, ఆలోచించి చటుక్కున విరహావేదనలో పడిపోయినాడు.

శర్మను జూస్తే జాలివేస్తుంది !

పాపం, అతను మాటుకు ఏంజేస్తాడు.

స్మృతి విరహానికి దారితీస్తుంది. అందులోకి తోస్తుంది. ఇల్లా అవుతుందని శాస్త్రంలో వ్రాసే వుంది. శర్మ నడిచిన నడక శాస్త్రసమ్మతమే కాని తాను అల్లాంటి ప్రతిజ్ఞచేసి ఈ విధంగా విరహంలోకి దిగటం ధీరలక్షణం మటుకు కాదు.

అప్పటికి ఇంకా రాత్రి పది కాలేదు. కాని శర్మమటుకు తీవ్రమైన విరహావేదనలో పడిపోయినాడు.

జానకి ఇంకా వంటఇంట్లో ఇల్లు సర్దుకొంటూనే ఉంది. అప్పుడే శర్మ విరహానికి సంబంధించిన విషాదము, ఔత్సుక్యము, చింత, ఉత్కంఠ, ఆవేగము, జడత, మోహము మొదలైన అవస్థలను పొందుతున్నాడు.

'కలిత కులిశ ఘాతాః కేఽపి ఖేలంతి వాతాః' అంటాడు. అంటే, వజ్రాఘాతముతో కూడుకొన్న ఏవో గాడ్పులు విసురు తున్నవట !

ఎప్పుడు !

పుష్యమాసంలో రాత్రి తొమ్మిది గంటలకు ! ఇంకా అంటాడూ, రసాల శిఖరముపైన గుంజనము చేస్తూ ఉన్న తుమ్మెద కూడా తనను బాధిస్తున్నదట !

కర్మం ఏం జేస్తాము !

విరహంలో ఉన్నవాడిని ఏది బడితే అదే బాధిస్తుంది !

ఈ విధంగా శర్మ చాలాసేపు విరహాన్ని పొందాడు. విప్రలంభ శృంగారానికి విరహము ఒక ప్రధానాంగము కాబట్టి ఇంత అవస్థపడి ఆ విరహాన్ని అంతా శాస్త్రరీత్యా శర్మ అనుభవిస్తున్నాడు. ఈ విరహానుభవంలోనే అతడు ప్రమత్తుడై నిద్రాదేవీ కుచయుగ్మ ముద్రితుడైనాడు.

✂

మరి కొంచెం సేపటికి జానకి వచ్చింది.

ఆమె కనకాంబరం చీర కట్టుకొన్నది. జరీపేటుగల లేతగులాబీరంగు రవిక తొడిగినది. తన కేశబంధమును పుష్పములతో అలంకృతము చేసినది. రతీదేవిలాగ శయ్యాగృహము ప్రవేశించినది.

ప్రవేశించి కమలములవంటి తన నేత్రములతో నలు దిక్కులా కలయజూచినది. చూచి తనభర్త నిద్రపోతూన్నట్లు గ్రహించినది. గ్రహించి ఆ హరిణాక్షి వదనమును వంచి మధుర మందస్మిత అయినది.

శర్మ ఇంత పెందలకడనే నిద్రపోవడము ఆమెకు చాలా ఆశ్చర్యమును కలుగజేసినది. ఆమె అతనివంక నిశ్చలంగా చూచినది. పూర్వానుభూతులు ఏవేవో జ్ఞప్తికి వచ్చినవి.

ఆ సుందర నేత్రాలూ, ఆ మృదులమధురాధరమూ హృదయపు భావాలను కదిలించి కామవశము చేయటానికి సమగ్రమైన ఆ అనుస్రూ, ఇనన్నికూడా ఆమెను వివశురాలినిగా చేసినవి. ఆమె అక్కడే అల్లాగ అతనిని చూస్తూ నిలబడిపోయింది.

ఆ నవ వధువు లేయెడనలో ఎట్టి తేనెలు జాలు వారుతున్నయ్యో నేను చెప్పలేను.

ఆమె తనువు ఎందుచేత పులకితము అయిందో కూడా నేను చెప్పలేను. అవే చెప్పలేనప్పుడు, ఇక ఆమె నిమీలిత స్నిగ్ధవిలోచనాలు ఎందుకు అయిందో, ఎందుకు తన వక్షోజాగ్రాలను మృదుపాణితో అదిమిపెట్టినదో నేను అసలే చెప్పలేను.

జానకి చాలాసేపు ప్రియుని మధుర వీక్షణాలతో సత్కరించినది. ఆమె బహుశః అతనిని సమీపించి కరస్పర్శచే సమాదరణ చేస్తుం దనుకొంటాను.

౬

అయ్యయ్యో! శర్మ చేసిన ప్రతిజ్ఞ ఆమెకు తెలియదు కదా! శివ, శివ, ఆ పిల్ల ఎట్టి అవమానానికి గురికానున్నదో కదా! ఆ పిల్లవాడు నీ ముఖం చూడనని కఠోర ప్రతిజ్ఞ చేశాడు. నీవు ఆదరికి పోవద్దుఅని ఆ పిల్లకు చెప్పేవాళ్లు అక్కడ ఎవ్వరూ లేకపోవడము చాలా విచారకరమైన విషయము.

జానకి, తల్పగతుడైయున్న శర్మను, మెల్లగా సమీపించినది. అతని శయ్యపై పడిఉండి కళ్ళు తెరచుకొని చూస్తూ ఉన్న శృంగార ప్రబంధాన్ని మూసి బల్లపై పెట్టింది. ఆ తరువాత యథాస్థానానికి వచ్చింది. ఆమె మన్మథ కలాపం ప్రారంభించింది.

ఒకమారు తన సౌందర్యమును అద్దంలో చూచుకొని పరితృప్త అయినది. తరువాత ఆమె శర్మవంక చూచినది. ఏదో ఆలోచన రాగా తనపైట సర్దుకొన్నది.

ఆ పిల్లకు మనస్సు సరిగా లేదు. శర్మ పడుకొన్న మంచం వైపునకు రెండడుగులు వేస్తుంది. మళ్ళీ వచ్చేసి అద్దంలో అందాలు దిద్దుకొంటుంది. మళ్ళీ అటు నడుస్తుంది. వచ్చేస్తుంది. ఎందుకు అల్లాగ చేస్తున్నదో నేను చెప్పలేను.

చివరకు ఆ పిల్ల ఏమనుకున్నదో ఏమో ధైర్యంచేసి మెల్లగా అడుగులో అడుగు వేసుకొంటూ, శయ్యను సమీపించి, నిద్రపోతూ ఉన్న శర్మపైకి వంగి, అతని వదనాన్ని నిదానించి చూచింది!

అరె! పదహారేండ్లైనా వెళ్ళని ముగ్ధబాలిక. రాత్రి పదిన్నర అయింది. బయట కటికచీకటి! గదిలో భర్త నిద్రపోతున్నాడు. తాను ఒంటరిగా ఉన్నది!

అల్లాంటి సమయంలో ఆ పిల్ల భయపడకుండా, అతనిపైకి వంగి మొహంలో మొహం పెట్టి చూసిందీ అంటే ఆ

పిల్లను ధైర్యవంతురాలు అనాలో, గడుసరి అనాలో నాకు తోచటంలేదు.

అల్లాగచూచి ఆ అమ్మాయి తనలో తాను ముసిముసి నవ్వులు నవ్వుకొన్నది. అప్పుడే నాకూ కాస్త జాలి వేసింది. ఎందుకూ అంటే;

శర్మ గాఢనిద్రలో ఉన్నాడూ, తన ఆగమనాన్ని తెలిసికొనలేదు అని అనుకొన్నదిగాని అతడు కఠోర ప్రతిజ్ఞా పరిపాలనా దీక్షాపరతంత్రుడై అల్లాగ నిద్రను నటిస్తున్నాడనీ, తన ముఖం చూడడని ఆ పిల్లకు తెలియదు కదా !

అందుకనే ఆపిల్ల స్థితిని జూస్తే నాకు జాలివేసింది.

ఆ పిల్లసంగతి వదిలివేద్దాము. శర్మ సంగతి చూద్దాము. అతని మనోనిగ్రహము కూడా చాలా గొప్పదనే చెప్పాలె. అతడు ఆ మెరాకను ఒక కంట కనిపెడుతునే ఉన్నాడు కాని ఏమీ చలించలేదు. నిర్వికారమైన చిత్తవృత్తితో కళ్ళు మూసికొని పడుకొని ఉన్నాడు.

ఆ పిల్ల భర్తను నిదానించి చూచింది.

తాంబూల చర్వణచే అరుణ రాగాంకితమైన అతని అధరాన్ని, తరుణ యౌవనంలో మెరుస్తూ ఉన్న ఆ యువకుని గండస్థలినీ ఆ పిల్ల చూచింది.

చూచి పులకిత గాత్ర అయినది. అమాయకురాలైన కారణానా, తనభర్త చేసిన భయంకర ప్రతిజ్ఞ ఇట్టిదీ అని తెలి

యని కారణాన, ఆ పిల్ల సాహసించి అతని పైకి వంగి, కపోలాలనూ, ఫాలభాగాన్నీ చుంబన మర్యాదలతో సత్కరించినది

అరె! ఆమె ముగ్ధబాలిక. లజ్జా నిహిత తన్వి. ఇంత సాహసకృత్యం చేస్తుందని నేనూ అనుకోలేదు.

ఆ అమ్మాయి ఏమీ చదువుకొన్నది కాదు. సంస్కృతం రాదు. లజ్జావిజిత. ఇల్లాంటి మన్మథ కళా నైపుణ్యమును ఎల్లాగ సంపాదించిందో నేను చెప్పలేను.

అతి నిగూఢములునూ, ప్రతిభా సముచితములునూ అయిన ఈ సంస్కృత మర్యాదలను ఆశుభాంగి ఎవ్వరివద్ద అభ్యసించిందో కూడా నేను చెప్పలేను.

ఇంకా విచిత్రం ఏమిటీ అంటే ఆమె మన్మథ ప్రేరితయై ఆ తరుణవయస్కుని, నేత్రద్వయినీ, ఇంకా ఇతర సౌందర్య సీమలనూ చుంబనముచేసి, పీయూషపానముచేసిన దానివలె పరితృప్త మనస్క అయినది. విజయ గర్వంతో ఆమె మంద స్మితకూడా అయినది. ఇంతకూ మనము అనుకొన్నట్లు జానకికి ఏమీ అవమానం జరగలేదు. మనమే పొరపడ్డాము.

అయితే.....

శర్మ సంగతి ఏమిటి?

అతడు తన ప్రతిజ్ఞను నిలుపుకొన్నాడా అన్న ప్రశ్న ఉండిపోయింది.

జానకి ఇల్లాగ చుంబన మర్యాదతో తనను సమాదరణ చేస్తూ ఉంటే శర్మ మాట్లాడలేదు. కాని జానకి పెట్టుకొంటూ ఉన్న ఒకొక్కముద్దు శర్మ దీక్షను ఒకొక్కమెట్టు క్రిందికి జార్చింది. శర్మ మొదట్లో ఈ విషయంలో చాలా విముఖత్వం చూపాడు. తన చెంపమీద ముద్దెట్టుకుంటూ ఉంటే శర్మ చటుక్కున ముఖం తిప్పేసుకొనేవాడు. తిప్పేసినాకూడా విగత ధైర్యకాక ఆ ధీరశీల తనకు ఏ శుభాంగం లభ్యమైతే దానినే పలుమారు ముద్దిడసాగింది. ఈ చెంప, ఆ చెంప, కంఠ సీమ, నేత్రసీమ ఒకటేమిటి, ఆ పవిత్రహృదయుని మృదుల సీమలన్నీ ముద్దుపెట్టుకొన్నది.

శర్మ అప్పటికీ చలించలేదు !!

ఎంత హృదయదార్ఢ్యం కలవాడైనా ఈదండయాత్రకు, ఈ పేశలఘాతములకు లొంగకుండా ఉండటంకష్టం! ధైర్యమూ పట్టుదలగలవాడు కాబట్టే శర్మ ఇంతవరకు తట్టుకొన్నాడు.

కాని చివరకు ఒక పిచ్చిపని చేశాడు. ధీరనాయకుడు చేయవలసిన పనికాదు అది! కాని చేశాడు. దానితో పతనము కలిగింది. ఏమిటీ అంటే.....

జానకి శిరోభాగాన్ని మాత్రము తన కరపద్మములలోకి తీసికొని పట్టుకుచ్చులవలె నున్న ఆమె కేశములను శర్మ ముద్దాడాడు.

అయితే, ప్రతిజ్ఞా భంగము కలిగింది కదా శర్మ విగత శ్లోకుడై, ప్రతిజ్ఞను నిలుపుకోలేనివాడై ఉత్తమ నాయక లక్షణా లను కోల్పోయినాడా లేదా అని ప్రశ్న.

శర్మ మటుకు తన ప్రతిజ్ఞాపాలనకు విరుద్ధమైన ప్రవర్తన జరగలేదంటాడు. ఎందుచేతనూ అంటే అతడు శృంగారలీల జరిపినా, ముద్దుపెట్టుకున్నా కళ్ళుమూసుకొనే ఉన్నాడట! ఆమె ముఖావలోకనం చేయలేదట.

అందుకని తన ప్రతిజ్ఞ నిలిచిందట!

ప్రతిజ్ఞా పాలన జరిగిందా లేదా అని నిర్ణయించటం చాలా కష్టం! అతడు శిరోభాగాన్ని మాత్రమే ముద్దుపెట్టు కొన్నాడాయె కర్మం!

అతడు జానకి కపోలపాళిని ముద్దుపెట్టుకొన్నట్లయితే నీవు 'కళ్లు తెరిచావు ఆమె ముఖం చూశావు' అని మనము గట్టిగా అనగలిగి ఉండేవాళ్ళం!

కాని ఇప్పుడు ఏమీ చేయలేము.

ఈ సంయోగ శృంగార లీలాక్రమంలో ముకుళిత నయనాలతో చుంబనక్రియ జరగటం సాధ్యమా అసాధ్యమా, సంభవమా అసంభవమా అన్న విషయం నిర్ణయించటం చాలా కష్టం.

ఆ విషయము అభినవ గుప్తపాదులకు వదలి వేద్దాము.

శర్మ ప్రతిష్టకు భంగం కలిగిందో లేదో నేను చెప్ప లేను. నేను చెప్పగలిగిందల్లా శర్మ జానకిని ముద్దుపెట్టు కొన్నాడు అని మాత్రమే!

శర్మ ఆమె ముంగురులను మాత్రమే ముద్దుపెట్టు కొన్నానూ అంటాడు!

కాని నా అనుమానం అతడు ఇంకా జారాడనే!